సద్వృక్షఫల ప్రవాహామరుత్తరంగిణీ పంకాయమానా కలంక
జాంబూనద సంపాదితాగణ్య పుణ్యస్వరూపం బగు జంబూ
ద్వీపంబుఁ బ్రవేశించి, యంత.

సీ. మలయశైలనితంబవలయ చందనలతా
నిలయవైభవము వర్ణించుకొనుచు
మంగళప్రస్థాభ్రభరంగలగ్నమనోజ్ఞ
శృంగలక్షణము లీక్షించుకొనుచు
మైనాకవివిధప్రసూనవారానూన
నానాకటకకాననములు గనుచుఁ
హల్లకాచలసరోహల్లకామోద సం
వేల్లితానిలము సేవించుకొనుచుఁ
గుతుక ముప్పొంగ మఱియుఁ ద్రికూట చిత్ర
కూట మణికూట వృషభ కౌకుభ మహేంద్ర
వారిధా రేంద్రకీలపర్వతములెల్ల
మెట్టి తత్పుణ్యభూములు చుట్టిచూచి.

క. చనిచని కాంచిరి విద్రుమ
వనరాగద్విగుణితాంబువర్ణముచేతం
గననొప్పు తామ్రపర్ణిన్
వననిధివరవర్ణినిన్ నవశ్రీపర్ణిన్.

గీ. కాంచి యిది పాండ్యభూపాలకాంచిత మగు
కేళిదీర్ఘిక యిది మంచికెంపురాలు

గలుగుచుండెను గని యిది కలశభవుఁడు
నిత్యసంధ్యావిధులు తీర్చు నెల వటంచు.

వ. అందు నందఱుఁ దీర్థంబులాడి,

క. ఆ తామ్రపర్ణి చెంగట
నాతామ్రప్రచురకిసలయద్యుతి నవ సం
జాతామ్రవరణముల వి
ఖ్యాతంబై మించునట్టి గజతీర్థంబున్.

వ. కనుంగొని తత్తటంబుననిల్చి, యందఱు నానందంబుతోడ.

సీ. లాలితశాలశైవాలజాలచ్ఛాయ
నీల కాయంబు వన్నియఁ బొసంగఁ
బైనిండఁ బర్విన పద్మరాగముల్
హాళిఁదితాపిత చాయ ననుకరింప
నగ్రజాగ్రద్వినీలాంబుజాత శ్రేణి
చాఁపిన తొండంపు జాడ నమరఁ
బార్శ్వతటోద్దీప పక్షినాదంబులు
ఘంటాఘణాత్కార గరిమఁ బెనుప
మారుతోద్ధూతశీకరమండలంబు
ఘనమధుపవిభ్రమము వెల్ప ననవరతముఁ
దనరు గజతీర్థ మనుట సార్థముగఁ జూపె
నద్భుతంబుగ నీసరోజాకరంబు.

క. అని పొగడుచు నా చెంగట
ననుపమతపమునఁ జెలంగు నాత్రేయుండా

మునిఁగని, యాత్రీర్థ గరిమ
మనఘా! వివరింపు మనుడు నతఁ డిట్లనియెన్.

చ. కరిణులు గొల్వనొక్కకరి, గాటపు వేసవిఁ దప్పిబాధ రాం
తరమునఁ గందరాటవుల దాపుల మేఁపులు మేసి మేసి పై
బిరుసుగ నెండవేఁడిమిఁ దపింపఁగ బెగ్గడిలంగ దప్పిచే
దిరుగుచు నెందు నీరు గల తెంకులు గానక దీనవృత్తి పైన్.

క. మన్నులు రేఁగఁగ నేనుఁగు
మన్నీఁడడవిఁబడి యెండమావులు ద్రావం
గన్నఱఁ బఱచుచు నడియా
స న్నొగులుచు వ్రాత సోలి జాలింబడుచున్.

గీ. కొన్ని వెంటియేనుఁగులుఁ దానుజోకనైను
మూఁకదప్పి, దప్పిమోము లెండఁ
జల్లగాలిజాడ మెల్లన యరసి, యా
సరసి దరిని నింపు బెరసి యంత.

క. కడుపులునిండఁగ జలముల్
వడిఁ గ్రోలెం దొండములను వారక సరసిం
బుడబుడ ముంచుచుఁ బ్రక్కలఁ
గుడియెడమకుఁ జల్లికొనుచుఁ గుంభీంద్రంబుల్.

క నిండార జలము ద్రావియు
వెండియు వెండియును గడుపు వెలితిగఁ బైపై
నొండొండ గ్రోలి జలరుహ
షండంబులతోడ గ్రీడ సల్పుచునుండన్.

క. మకరం బొక్కటి యక్కరిఁ
గికురించుచు నాడికొఱఁగి ఱికలఁ బదముల్
వెకలించిన, నించుక కద
లకయుండం బట్టి బిట్టు లా వడరంగన్.

ఉ. పట్టిన నగ్గజేంద్రమును బాదములం బెకలించి చూచి, యి
ట్టట్టు చలింపరా కతిభయంబున మస్తకముం దటంబులం
గొట్టుచుఁ, గూఁత వెట్టుచును గుంభయుగాంతరసీమ హస్తమున్
బెట్టుచు నార్తిహారి హరిఁ బేర్కొని యుచ్చతరస్వనంబునన్.

ఉ. ఓహరి యోదయాంబునిధి యోభవబంధరుజాపహా మహా
దాహము చేత నంబువులు ద్రావఁగ నిచ్చటఁ జేరి, యీజల
గ్రాహము చేతఁ జిక్కువడి గాసిలితి న్ననుఁ గావవే యసం
దేహముగాఁగ నీవ యిట దిక్కుసుమీ ఖగరాజవాహనా !

క. అనిపల్కెడు కరి మొఱఁదా
వినియెనొ వినలేదొ యింత విస్మయముగ నం
తన దీనభక్తరక్షణ
ఘనుఁడు మురాంతకుఁ డనంతకరుణ దలిర్పన్.

సీ. తనుబిల్చినప్పుడ వినిలోనుపడెనంచు
మకరంబు కరి రేకుమడఁచునొక్కొ
విభుఁడు గల్గిన మొఱవినఁడొ లేఁడని దంతి
జడిసి ప్రాణము లేడ విడుచునొక్కొ

యార్తులరక్షింతు ననిపల్కుచుండెదు
బిరుదు నేఁటికి లేక జరగునొక్కొ
యుంకించివైచిన యురువడి నేనియుఁ
జక్రంబు నక్రంబుఁ జఱచదొక్కొ
యనుచుఁ దార్క్ష్యుండు మదిమీఱి చనఁగ వాని
నిఱికియొత్తుచు నచ్యుతుఁ డేగుదెంచెఁ
దనదు దర్శనమును సుదర్శనము నపుడు
చక్రపదనక్రముల నొక్కసారెఁ బొడువ.

క. హరి గరుడుల రుచు లత్తఱి
సరిగా నొండొండ తీవ చాలుగఁ దగ నం
బరమున గన నెప్పుడును గం
ధరమణిధనువులని యాత్మఁ దలఁచిరి వేల్పుల్.

క. కరి తలఁచుట మునుపో హరి
కరితలఁ గరమిడుట మునుపో కాదగు నని యొం
డొరులం బలుకుచుఁ దలఁచిరి
యరుదుగ సురలలికరంజితాంజలు లగుచున్.

క. చక్రపదసార్వభౌముని
యాక్రందన రవమునందు నైక్యము నొందెం
జక్రికరచక్రవిదళిత
నక్రార్తరవంబు వెఱఁగునన్ సురలుండన్.

క. హరిహస్త స్పర్శనమునఁ
గరియును గరిభావ మెడలి గంధర్వుండై
సురమార్గంబున నాయం
బురుహాక్షుం భక్తరక్షుఁ బొగడుచుఁ జనియెన్.

గీ. నాటఁగోలెను గజతీర్థనామ మొదవె
నీసరోవరమునకు మునీంద్రులార!
యిందుఁ గ్రుంకిన జనులకు నిందుధరుని
కంటె మిక్కిలి సంపద గలుగుచుండు.

వ. అనిన విని యక్కరివరదుని మహత్త్వంబు చిత్తంబుల హత్తి నృత్తంబులాడుచుండ.

సీ. పండె మిమ్మని లక్ష్మి పంతంబుతోనన
నెద కౌస్తుభ మెడల్చి యదరవైచి
పడఁతి పాదములందుఁ జావలు గదియింపఁ
దొడిగియుఁ దొడుగక త్రొలఁగఁద్రోచి
కదిసి విష్వక్సేను కైదండ యొడిసియుఁ
గడువేగ మదరంగఁ గడకు నూఁకి
బరిమేని గరుడుని నురువడిమై నెక్కి
పదపదమని సారె పన్నె సోఁకి
సురలు గని మ్రొక్క యసురులు సురిగి స్రుక్కఁ
జక్రమున నక్రశిరమును జక్కఁజేసి
హస్తమున హస్తి మస్తంబు మస్తకించి
వెలయు శ్రీహరి శుభము గావించు మాకు.

క. అని పొగడుచు నాతీర్థం
బునఁ దానములాడి వెడలి మునిశేఖరు ల
వ్వనజాక్షుభక్తరక్షణ
ఘనకథలు నుతించికొనుచుఁ గౌతుక మెసఁగన్.

మ. ఇభతీర్థంబటుదాఁటియవ్వలమునుల్ హిండత్రివ్సాసాంద్రచం
ద్రభటాభంగఘటీనటాయితము లానందంబునొందింపఁగా
శుభవారింవనువుల్ దొలంచి యవలన్ సొంపొందునింద్రోపల
ప్రభలన్ వెగ్గెడు బాలకృష్ణు విభవభ్రాజిష్ణు సేవించుచున్.

క. సీతాపతిదోర్వైభవ
కేతువు దశవదనమదనఖేలైకకథా
హేతువు తాపసజనజీ
వాతువు సేతువును జూచువాంఛలు వెలయన్.

వ. అవ్వలనం జని రనిన విని యమ్మహార్షు లత్యంతహర్షంబునం
దరువాతివృత్తాంతంబు వివరింపు మని యడుగుటయు.

మ. భువనాపూర్ణపిచండచండదనుజాంభోజాతనేదండ దం
డవినమ్రామృతకుండ కుండలిపఘటావైభవాఖండ ఖం
డవిధూత్తంసకకాండకాండకుహరాండధ్వామమాత్రాంచితాం
డవితోద్దండశిఖండిమండలవిభాడంబాంబునోజ్జృంభణా !

క. బంహిష్ఠనిష్ఠురాశుగ
సంహాతి సంహృతనిశాటఘాటమహీంభృ
త్సింహా సతతోపనిషదుప
బృంహితవేదైకమూర్తి భేదనకీర్తీ.

పంచ. ఘనాఘనాభ తారకప్రకాశ భక్తరంజనా
జనావనా భుజాగ్ర చక్రజర్జరత్పలాశనా
దినాధినాథయూథ తేజ దిక్ప్రసిద్ధశాసనా
సనాశనాసుధామృగేంద్ర చంద్రజిద్యశోఘనా.

గద్య. ఇది శ్రీరామ చంద్రసాంద్రకరుణాకటాక్షలబ్ధ సిద్ధసార స్వతనిశ్శేషనిరర్గళవాగ్వైభవాశేషసరససాహిత్యకళాభోజ సత్య సంభూషితముఖాంభోజ సకలసామ్రాజ్యధౌరేయ నిరతావారి తాన్నసత్రసంతోషిత ప్రతిదివసపంచాశత్సహస్రభూసుర బహు వారావర్తిత మహాదానవైభవానర్తిత భాసుర నిజనామాంకి తాకళంక వస్తుసమగ్ర బహుళాగ్రహారభూషిత చోళధరామం డల నిఖిలభోగనిర్జితాఖండలసాధిత సముద్రాంతరద్వీపవసన్నృ పాలసంస్తుత ప్రతాప నేపాళభూపాలస్థాపనాచార్య కర్ణాటరా జపూజనీయ ధౌరంధర్య రామసేతు శ్రీరంగవిజయరాఘవపుర కుంభకోణాది దివ్యస్థలప్రతిష్ఠాపిత రామభద్ర సర్వజనసంభావిత గాంభీర్య ముద్రావినిర్జితసముద్రసదాశ్రితభరణదీక్షాదక్షదక్షిణ సింహాసనాధ్యక్ష రాజాధిరాజసన్నుతాసాధారణ శౌర్యదిగంత ప్రసిద్ధతరౌదార్యసుజ్ఞానజనకసతతసంసేవితజనక పోషితవిద్వత్క వియూథ భువనశోభితగుణసనాథ బలవత్పరిగృహీత సామంత మహీకాంత విమోచనశ్లాఘనీయబాహాబల మూర్తిమాంబా గర్భశుక్తిముక్తాఫల చినచెవ్వయాచ్యుతనృపాలపుత్ర సజ్జనస్తోత్ర పాత్ర రూపరేఖావిజిత కుసుమసాయక శ్రీరఘునాథనాయక ప్రణీతంబైన వాల్మీకిచరిత్రం బను మహాప్రబంధంబు నందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# వాల్మీకి చరిత్రము.



## ద్వితీయాశ్వాసము.



శ్రీకాంతాకుచభద్ర
శ్రీకాంతభుజాంతరాళ శీతలకరుణా
లోకప్లావితనత యుత
సీకుసుమసమానధామ శ్రీరఘురామా!

వ. అవధరింపు మప్పర్వతుం డస్మానుల కిట్లనియె నివ్విధంబు న
నమ్మునీంద్రు లానందంబున.

క. దక్షిణదిగ్భాగమునఁ బ్ర
దక్షిణగతి నరిగి యరిగి దర్భశయనముఁ గ్
వీక్షించి సేతుమూలా
ధ్యక్షుఁ గ్ శ్రీరాముఁ గొలిచి తద్దయు వేడ్కన్.

సీ. చక్రతీర్థంబున స్నానంబు గావించి
భేతాళవారిధి స్నాతులగుచుఁ
బాపవినాశనీ ప్లావనం బొనరించి
సీతాసరస్సునఁ జెలఁగియాడ

మంగళతీర్థసంపర్క మానందించి
యమృతవాటికను దేహములు వొలంచి
లక్ష్మణతీర్థ ఖేలనమున నలరుచు
రామ తీర్థంబు పూరములఁ గ్రుంకి

శంఖచక్రజటాతీర్థ జలములందుఁ
దానములు చేసి గంధమాదనసుగంధ
మందరసుగంధవనమంద మందగంధ
వాహముల దేహముల శ్రమ వ్రాల్చి వ్రోల.

గీ. వెండి యును నారలు హనుమత్కుండమునను
బ్రహ్మకుండంబునను దీర్ఘరాజమైన
కోటితీర్థంబునను ధనుష్కోటియందుఁ
గ్రుంకులిడి రామలింగంబుఁ గొలిచినిలిచి.

---

మహాస్రగ్ధర.

గని వానుల్ కాంచిరంతన్, సరభసవిసరత్సాంద్రపీవీచురీచీ
జనితోద్గాఢాంధకారస్థగిత దశదిశాచక్రకద్యోతివిద్యో
తనకృత్స్వాగీనరఝాటోత్తగళతరద్భృగంతప్రభా......

క. ... ... ... ...
... లా

కాంచితపాఠీనఘటా
చంచల్లుఠనములు సారెసారెకుఁ గనుచున్.

క. ఆలంకాపాథో మ
ధ్యాలంకారప్రకారదాకారమునం
గ్రాలు నల రామసేతువు
నాలోకించుచు మునీంద్రు లతిహర్షమునన్.

చ. పరిసరవిద్రుమద్రుమవిభాపటలంబులఁ దంబు నల్గడం
బొరిఁబొరిఁ గప్పనొప్పె రఘుపుంగవు సేతువు సూడుమో మునీ
శ్వరకులచంద్ర! యీ జలధి శైవలినీశ్వరి యుచ్చ గంపుగా
సరిపెణ మేన నీటుగన జందెపువాటుగఁ బైచనో యనన్.

క. బిట్టురువడి నూఱేనుఁగు
లిట్టలముగఁ బోరవరుణుఁ డెప్పుడు నడుమం
గట్టించిన కట్టన నీ
కట్ట సెలంగెడును పారికాంక్షిప్రవరా!

క. వారిధిరంగస్థలమున
జేరి తరంగమ్ములనెడు జెట్టులు పైపైఁ
బోరంగ నడుమ బలుఁపిరి
సారించిన సరణి సేతుసరణి చెలంగెన్.

క. ధరణీతరుణీమణికం
బరమగు నీయంబురాశి మధ్యంబున న
బ్బురపు నెరిక యన సేతువు
గర మలరెడు వివిధతరునికరదంతురమై.

క. ఆలోకించితె సేతువు
నాలోకాలోకమహీధరా క్రోంచలమా
పౌల స్త్యజయ స్తంభము
ప్రాలి జలధిఁ దేలియాడు వగఁ గనుపట్టున్.

సీ. భోగికులపతిసంతతి భూమివలయ
వహనజాతపరిశ్రాంతి వదల నుదధి
పైకిఁ దేలుచుఁ దనసంధిభార మెడల
నిగిడెనో యన సేతువు దగె నగేంద్ర!

ఉ. ఈవనరాశి మీఁదట శయించిన మాధవు గౌరవించి యిం
పావహిలన్ మహీమహిళ యూఁదటఁ జాఁచినహస్తమో యనం
గా విలసిల్లెడున్ గళితకంకణనాదము లించ రాఘవ
శ్లాఘ్యవరు సేతు వెంతయును గౌతుకమిచ్చు మునీంద్రచంద్రమా!

క. అనియిట్టులు వివిధగతులను
వననిధిఘనసేతుమహిమ వర్ణించుచు న
మ్మునులు చటఁ గదలి బహుపు
ణ్యసరులు వనములును గాన నరయుచునుండన్.

మ. కనకవ్యోం బురరత్న మొక్కటి, వియద్గంగాతరంగానుషం
గసదన్మందరగంధవాహవిధుతాంగశ్రాంతి నృత్యద్వధూ
జనమంజీరఝుణంఝుణస్వనితచంచచ్చంద్రశాలావిలా
సనవేంద్రూపలసౌధయూథరుచి సంఛన్నాగ్రదిగ్భాగమై.

క. అదిగని మధురానగరం
బిదిగోఁ దడవులకుఁ గంటి మీనాకృతమాలా
నదిఁ గ్రుంకి సోమసుందరుఁ
బదరక సేవింపవలయుఁ బదపదఁ డనుచున్.

గీ. అరిగి వారలు హేమపుష్కరిణి చెంతఁ
గాంతతరమైన నీ పవనాంతరమునఁ
దనరు కర్పూరసుందరుఁ దరుణ శీత
కిరణశేఖరుఁ గని, నమస్కృతులు సేసి.

గీ. పంచశరభంగ కర్పూరపాండురాంగ,
మేరుకోదండ ధృతరమామిత్రకాండ
నాగవరహారకలధౌతనగవిహార,
నీకు మ్రొక్కెద మభవ యనింద్యవిభవ !

వ. అని సన్నుతించి వెండియుం జతుష్షష్టిలీలావినోది యగు హాలాస్యనాథుని మహిమ భావించి.

సీ. మౌనులకందఁగరాని మోక్షంబు పక్షికి
దయచేసె నెవ్వాఁడు నయమొలగ్ప
వివిధార్థములుగ ద్రావిడసూత్రములు సల
క్షణముగా నెవ్వాఁడు సంగ్రహించె
జంబుకంబుల దురంగంబులుగాఁ జేసి
యమ్మె నెవ్వాఁడు పాండ్యాధిపతికి

శ్రుతినిందకులఁ దామసుల శూలవిద్ధులఁ
గావించె నెవ్వాఁడు ఘనత మెఱయఁ
దట్టుఁదలఁ బెట్టి వట్టుఁడు పిట్టొసంగు
ముసలియవ్వకు నై మన్ను మోచె నెవ్వఁ
డట్టిలింగస్వరూపున కఖిలపతికి
సోమసుందరునకు సీమ జోడుఁగలరె.

వ. అని వర్ణించుచు నవ్వలం జనిచని.

శా. అంతంగాంచిరి వారిచూడ్కికనవద్యప్రోద్యానుద్యానముల్
వింత ల్సేయుచు నుండఁగా నుభయకావేర్యంతగీపాంతరా
క్రాంతాశాంతవిచిత్రగోపురఘనప్రాకారసౌధావళీ
ప్రాంతప్రోతమణిప్రభోజ్జ్వలనభోరంగంబు శ్రీరంగమున్.

క. కనుఁగొని కావేరీజల
మునఁ గ్రుంకుచు వేదశృంగమును బ్రణవము నం
బును నగు రంగవిమాన
మ్మునకు నమస్కృతులు సేసి మునికులచంద్రుల్.

సీ. మంచితెమ్మెరదూది వించిన నోదుమ
వన్నెపానుపుమీఁద నున్నవాని
వలచేదలాడగా నిలిపి వామకరంబుఁ
జిఱుతొడపైఁ జాఁచి మెఱయువాని
దృక్కోణఘనఘృణామృతము మీఁటెడులీల
నెలనవ్వు చెక్కుల దొలఁకువానిఁ

దనపాదపద్మముల్ దప్పక సేవించు
నలవిభీషణుఁ జూచి యలరువాని
సరస వాయక జయజయశబ్దములను
మించుపంచాయుధములను నించువాని
రంగతరళితమణిభూషణాంగవిభుని
రంగవిభుఁ గాంచి చిత్త ముప్పొంగుచుండె.

క. దండము లిడి నిలిచి సము
ద్దండఘనశ్యాము రంగధాముం *బాశో
ద్దండజనకు నానాజగ
దండధురంధరు నుతించి రంచితఫణితిన్.

శా. కావేరీహృదయాభిరామపులినాకల్పాహితల్పంబునన్
శ్రీవామాక్షియు నీవు లోకములు రక్షింపంగనున్నాఁడవే
హోవిశ్వంభర హోకృపాజలనిధీ హోరంగ గేహాంచితా
శ్రీవత్సస్తుతవత్స వత్సలత రంజిల్లన్ మముం బ్రోవవే.

వ. అనిమఱియు మునిపుంగవు లాభుజంగశయనుం గని యంతరం
గంబుల భక్తి యుప్పొంగుచుండ.

---

* పాశోద్దండుఁడు=బ్రహ్మ. బ్రహ్మకుఁ బాశముఁ జెప్పినందులకు, "కరములఁ బాశంబు గాలాపుఁ ద్రాడుగాఁ గాలాగ్రదండంబు గదయుఁ గాఁగ." కుమార. ఆశ్వా ౧౦-౧౯౭ వ పద్యము. మఱియు "వదనచతుష్టయం బిల్లద, రజోగుణమిల్లద పద్మపీఠము ల్లద, కలహంసమిల్లద, కమండలు విల్లద, పాశరజ్జువి ల్లద." జగన్నాథవిజయము. ఆ ౧౬౧.

చ. తలఁగడ బాముఁ జేర్చుకొని దయ్యము నెయ్యము నమ్మి యేటిలో
నెలవుగ నిల్లుఁగట్టుకొని నీవిటులుండఁగ నోర్చుటెట్లు మా
వలనగు మానసాబ్జముల వాసము సేయు; కొఱంత లేదు నీ
యలమట దీఱెఁ జుమీ వినువిహంగమవాహనరంగమోహనా.

క. అన వారి ముగ్ధభక్తికి
ననయంబును నలరి రంగహరి నవ్వుచు మీ
మనసులలోనన యున్నాఁ
డను జనుఁ డని పలుక సజ్జటాధరవరులున్.

సీ. పంకజబంధుబింబస్థాయి త్రైలోక్య
మంగళదాయి శ్రీరంగశాయి
సకలజనానందసంధాయి గరుడతు
రంగమయాయి శ్రీరంగశాయి
సహ్యకన్యాతటాంచలకులాయి ప్రపంచ
రక్షణోపాయి శ్రీరంగశాయి
యఖిలదైవతసంసదతిశాయి యగణిత
బ్రహ్మాండకాయి శ్రీరంగశాయి

గీ. నిఖిలజగదింద్రజాలంబు నెఱపుమాయి
యచ్చులకునెల్ల మొదలనచ్చినవ్రాయి
కొలుచువారలపాలిటి తలఁపురాయి
రావణానుజదాయి శ్రీరంగశాయి.

గీ. రంగనిలయోపవాసంబు రంగనాథ
చరణపంకేరుహద్వంద్వసంభజనముఁ
జంద్రపుష్కరిణీస్నానసంగతియును
గలిగె మనలకు భాగ్యంబుకతననేఁడు.

వ. అని పొగడుచు నవ్వలం గడచియుంగ.

సీ. ఏవీటనిరవొందు నిందుశేఖరుఁ డొప్పు
బృహదీశ్వరుం డనుపేరుఁ గాంచి
యేపట్టనమునకు నేలికయౌ నృసిం
హస్వామి జనకామితార్థభూమి
యేప్రోలికెలన నెన్నైలరారు నీలమే
ఘశ్యాముఁ డిందిరాకాముకుండు
నేనగరమున నిర్హేతుకదయఁ బ్రోచు
నతకల్పవల్లి యానందవల్లి

గీ. యెచట విలసిల్లుఁదగ సుందరేశ్వరుండు
ప్రాంతకాంత కవేరకన్యాంబుధన్య
వివిధసస్యప్రశస్యమై వెలయుచుండు
నట్టి తంజాపురంబున కరిగి వేడ్క.

ఉ. అందలి సౌధయూథములయందము నచ్చటికేళికావనీ
బృందము చంద మాకెలన బింకపుఁజూపులకోపులింపుగా
నిందుముఖుల్ నటించువగ తెల్లఁగనుంగొనిపొంగి [illegible]
రందరపట్టణంబె యిదిరా మదిరాజిలె నంచు నెంచుచున్.

మ. చని రమ్యాశ్రమములు నంతఁగొంతదవులన్ సాంద్రద్రుమాకీర్ణకా
ననముల్ గొన్నిటి దాఁటి, ప్రాగ్ధిశరమానాథప్రభారమ్యహ
ర్మ్యనికాయంబులఁ జూడఁజూడఁగుతుకంబాదక్షిణద్వారకం
దనగన్ నిల్చిన మన్ననారువసుధాధారు న్నిరీక్షించుచున్.

క. సేవించి తదాకృతి మది
భావించి కరాబ్జయుగళిఫాలస్థలికిన్
రావించి మిగుల సన్నుతి
గావించి ముదశ్రుపూరకలిత నయనుడై.

సీ. పసిబిడ్డయైయుండి బండిరాకాసి కీ
లెడలఁదన్నినయాతఁ డితఁడు కాఁడె
కాళియుభోగరంగస్థలంబునయందు
నృత్తమాడినయాతఁ డితఁడు కాఁడె
గొల్లగుల్లాండ్ర మక్కువ వెల్లఁ గొల్లాడి
వేణుగానమునాతఁ డితఁడు కాఁడె
గోధనంబులకెల్ల గొడుగుగా గిరివ్రేల
నెత్తిపట్టినయాతఁ డితఁడు కాఁడె

గీ. యిచట సంపంగిమొగ్గ తాయెతులసిగయుఁ
జేతబెత్తంబు మొలను బసిండిపిడియ
మును సమర రాజవేషముఁ బూనియున్న
వాఁడితఁడ మాయఁ దెలియంగవశమె మొందు.

గీ. అనుచు నారాజగోపాలు నభినుతించి
మించి కమలాపురంబును గాంచి యచట
భోగరాగంబులను జాలఁబోలుపు మీఱు
త్యాగరాజుల సేవించి హర్ష మెసఁగ.

చ. అనఘరతుల్ మునీంద్రులును నావల నావల మూఁగి తపో
వనపవమానముల్ శ్రమజవారి హరింపఁగ వేఁగఁ జేరి తీ
ఘనవివిధాగ్రహారములు కౌతుకముం బచరించుచుండఁగాఁ
గని రటఁ గుంభకోణము ధగద్ధగితోంనమణిప్రఘాణమున్.

వ. కనుంగొని యచ్చట.

సీ. చక్రపాణికి నమస్కారంబు గావించి
శార్ఙ్గపాణికిఁ గరాంజలి ఘటించి
కుంభేశ్వరునకు మ్రొక్కులు గూర్చి యలసోమ
నాథుల కభివందనములు సేసి
నాగనాథునకుఁ బ్రణామంబు సవరించి
విశ్వనాథునకును వినతిసలిపి
అవిముక్తశివునకు సాష్టాంగదండంబు
లాచరించి మఱియు నచటఁగలుగు

గీ. దేవతాతతి కెల్లను భావశుద్ధి
చెలఁగుచుండ నమోవాక మలవరించి
యభ్రసభఁ జూచుకుతుక మదభ్రలీల
నలర నమ్మౌనిపుంగవులవల దాఁటి.

క. శ్రీనృసింహుఁ గాంచి తప
శ్రీమించఁగ నిత్యపుష్కరిణిఁ గ్రుంకి దయా
భూమిన్ శ్వేతవరాహ
స్వామిన్ సేవించి యవలఁ జనిచని యంతన్.

ఉ. ప్రాంజలియై పతంజలిమహాముని రంజిలి చూడఁగా వెసల్
మంజులపాదనూపురఝుళంఝుళసద్ధ్వని మ్రోయుచుండఁగాఁ
గంజజ లోకసంభవరఁ గేవలతాండవమూర్తిఁ జిత్తభూ
భంజనుఁ బొందు వేడ్కనలభర్మసభం గని విస్మితాత్ములై.

గీ. ఇందుశేఖరు సేవించి యెందు మాకు
భేద మెక్కడి దంచుఁ గాన్పించులీల
సంధ్యాఘనభోగవిభవంబు లందుచుండఁ
దిల్లగోవిందరాజులఁ దేటభక్తి.

వ. కొలిచి మఱియు నాభద్రసభాపతి విభవంబులు పరీక్షించి.

సీ. నొసలికన్ బెనుమంట మసలునో పైకన
నిడుద కెంజడగుంపు గడలుకొనఁగ
నిలమోఁదు పాదము వలగొన్న నూపురం
బొండొండశబ్దంబు లుగ్గడింప
భక్తులఁ బిలిచి సంపదలిత్తు ననుభంగి
ఢమఢమధ్వనితోడి ఢక్క మొరయ
వాలిచందురుఁడు డాకాలియందియఁ దోఁచి
నిర్ద్వంద్వభావంబు నెరయఁజేయ

గీ. హత్తి మై యొప్పు గెంటెంబు గుత్తముగను
గదిసి రింగులువాఱంగఁ గట్టి యసుర
మట్టి నాట్యంబుసలుపు నుమాధవుండు
మాకువిభవంబు లొసఁగుచు మనుచుఁగాత.

వ. అని సన్నుతించుచు నిలింపబాలికాకేళికాభవనాయమాన మాణిక్యఖచిత చకచకిత సౌధయూథప్రభాడంబరంబగు చిదంబరంబుఁ గడచి యంత.

క. అరుణాచలవిభుఁ గరుణా
వరుణాలయుఁ గాంచి కాంచివరమునిఁ దేజ
స్ఫురణాగుణమణినానా
భరణాంచితు నేకచూతపతిఁ గనుగొనుచున్.

చ. చనిచని కాంచి రంత హరిచందనభూరుహచారువాటికా
వని వనితాసహాయ సురవైణికతల్లజ పాణివల్లకీ
ఘననినదానుకారి మణికందరజాలముఁ బంచవర్ణ కాం
చనకలవింకచక్రవిలసద్ధ్వనిశీలము శేషశైలమున్.

వ. కనుంగొని యవ్వేంకటమహీధరంబున విశంకటమణిసోపానంబులం దముకుమ్రోసినగతి ముముకు నాకాశగంగాతరంగిణీ సంగంబులు దొలంచి, యభంగభంగతాండవంబులం బెరయు, పాండవతీర్థంబునం దానంబులుగావించి, తటమహీరుహానీకం బక ప్రసవడంబరంబులం గదంబించు తుంబురుతీర్థంబునం గ్రుంకులిడి, మఱియు నఘాపనోదసమర్థంబు లగు ననేక

తీర్థంబులానుము వచ్చి వచ్చి, మజ్జనపరమజ్జన పుష్కలా
యుష్కలావిష్కారిణియుఁ బాపిజనపాపకళంకదుష్క్రియాపం
కజకరణియునగు స్వామిపుష్కరిణిఁ దీర్థంబులాడి,

గీ. కువలయంబున నిదియపై కుంభమునుముఁ
గరముఁ జూపుచు భక్తిని గరము ప్రోవ
స్వామిపుష్కరిణీ తీరభూమి నలరు
వేంకటాచలనాథు సేవించి నిలిచి.

సీ. మణికిరీటంబు సంపద లేమి యనవచ్చు
నమ్మ మూర్తియపు నామస్సూసంబు
మందహాసంబుల యందంబు హైసరే
సరిలేదు మెడకంటసరికి నెంకు
నుదరబంధము నొప్పుఁ హారహారా మెచ్చుల
మెచ్చునో బంగారు పచ్చడంబు
కటిఁ బసిండి కటారి కాంతి యెంతటివింగ
మంజీరముల మంజిమంబు మేలు
ఉచితశృంగార మితనికి నొప్పుజూపుఁ
డిట్టి చక్కనితండ్రి యెందేని గలఁడె
వలతురీ వేంకటాచలవల్లభునకు
యోగిపురుషులు మదియందయునిచి చాల.

వ. ఇక్కరణి నక్కంజాక్షుని చక్కఁదనంబునకు మిక్కిలి చొక్కి
మఱియును.

లయగ్రాహి.

పంకజకరాకుచ విశంకటతటీరచిత
కుంకుమపటీరరుచి సంకలితవక్షో
లంకరణకౌస్తుభశశాంకరవిలోచన ప్రి
యంకరగుణప్రకర కింకరదమర్త్యా
శంకర నుతానతశివంకర సురాహిత భ
యంకర శరాగతకళంక భువనక్షే
మంకర మునీంద్రగణ సంకథిత పావన ని
రంకుశమహామహిమ వేంకటగిరీశా !

క. సంకటము లెల్లఁ దొలఁగె వి
శంకట భవదీయవితతసతతఘనఘృణా
కంకటము గలుగమాకున్
వేంకటగిరినిలయ ! కాంతివిజిత కువలయా !

గీ. అనుచు నవ్వేంకటాద్రీశు నభినుతించి
మించి యవ్వలఁ జని మునుల్ గాంచిరంత
నంచితానందతీర్థసమర్థన సుమ
హాబలంబగునట్టి యహోబిలంబు.

క. కాంచి మునిచంద్రు లచ్చటఁ
జెంచుల దోరయనఁ జెలంగి చెంచెతలకటా
క్షాంచలముల మరగిన నర
పంచాననుఁ భక్తవరదు భజియించి తగన్.

సీ. హరి యిక్కడను స్వామిహరియై హిరణ్యాక
శిపుఁ జీరె ఖరనఖశిఖరములను
బక్షీంద్రుఁ డిటఁ దపస్సాక్షికంబుగ దపం
బొనరించి విష్ణువాహనతఁ జెందె
గంగ నిర్జరులు డిగ్గంగఁ జేయఁగ నిందు
భవనాశినీధునీప్రథ వహించె
నబ్జాతుఁ డిచ్చటఁ గుబ్జామ్రభూజమై
యమృతఫలములు దీనాళికిచ్చె

ననుచు నచ్చటి మహిమంబు నభినుతించు
కొనుచు నక్కొండఁగల తీర్థకుండలములను
దానములు చేసి మీఁది నెత్తంబు వెంట
జరిగి, యవ్వల నమ్మునుల్ హర్ష మెసఁగ.

సీ. తవణిల్లు నెచటఁగాష్మజ్యోతి విద్యోతి
తారణ్యనివహమై యహరహంబు
నొనరు నెచ్చట ద్రుణజ్యోతి ఖద్యోతిత
కీటమై ఘనగుహాగేహములను
గ్రాలు నెచ్చటఁ వాలుకాజ్యోతి సద్యోతి
మోహితశబరసమూహమగుచు
నుండు నెచ్చట శిలాజ్యోతి యుద్యోతిత
శృంగంబులను రత్నభంగి నెపుడు

నలరు నెచట బరంజ్యోతి యతివిశుద్ధ
తరణి మణిశబ్ధబిలధగద్ధగితభాగ
యోగసన్నద్ధ బహుసిద్ధ యోగిమతుల
నట్టి శ్రీపర్వతమునకు నరిగి రంత.

క. గంగాది తీర్థజలముల
నంగంబులఁ దోలఁచి మల్లికార్జునునకు నా
రంగగిరిమల్లికార్జున
రంగత్కుసుమములఁ బూజ రచియించి తగన్.

మ. కనిరంతః భ్రమరాంబికః హారిమణీకాదంబకాదంబినీ
జనిశోభానికురుంబ నంబరచరీచంచత్కరాంభోజ భా
జనవాలవ్యజనానిలాంకుర చలాంచత్కుంతలం గాంతలం
ఘనజంఘాలమృగేంద్రవాహనసహాగ్రైవేయ శాతోదరః.

క. కనుఁగొని సాంబశివస్తవ
మున నమ్మకుటావబద్ధముగ్ధసుధాంశుః
వినుతించిన నాత్రిభువన
జనకుండును నద్భుతంబు సంఘటిలంగన్.

సీ. చుక్కల దొరమొకించుక నిక్క శిరసునఁ
బసినూలు చెంగులపాగఁ జుట్టి
తఱచు వెన్నెలలీను దళుకునెమ్మోముపైఁ
దొలుపల్కులీనెడు తొడవువెట్టి

ముద్దులజింక మున్మొన పోటుముట్టును
సరవితో రెండుహస్తములఁ బట్టి
పెళపెళమను చెఱంగులరంగు లడరెడు
మూఁడువన్నెలపట్టు మొలను గట్టి

కేల్గలుకు ముత్తియఁపుజాయ గిబ్బనెక్కి
చారుశరహారశృంగారహారి యగుచు
ధారుణీధరరాజనందనయుఁ దాను
నమ్మునీంద్రులమ్రోలఁ బ్రత్యక్షమయ్యె.

గీ. ఇట్లు సాక్షాత్కరించి యా ఋషులఁగాంచి
దాంతిఘనులార! మీను వశాంతికనుతి
మెచ్చివచ్చితి నిచ్చలు నిచ్చు హెచ్చు
కోర్కెలెల్లను మీకుఁ జేకూరుఁ గాక!

గీ. ఇదియుఁగా దెన్న నిచ్చటనెందు నెవరు
నెంతమాత్రంబు నుతియింతు రంతలోన
నేను వారి కభీష్టంబు లిత్తు వేగ
మానివరులార యీగిరిమహిమవలన.

వ. అని పలికి భుజంగకంకణుం డాలింగమధ్యంబునం బ్రవేశించె; నంత నక్కాంచనాచలచాపస్వరూపావలోకంబున నానందంబు నొందుచున్న యమ్మునిచంద్రులుం గుటజప్రసూనవాసితంబు లగు నుటజప్రఘాణంబుల నేణీడింభంబులు సంభ్ర

మంబున నక్కడక్కడ జాతి పరికొను కానుగనింగనాభకస్తూరికా రాసారంబులు చవిఁగొని తృళ్ళగింతలిడ వానినెంబడించు బరువులిడు మునిబాలికల కేళికలు విలోకించి, తదంగణంబుల మునిగణంబుల పవిత్రతధవిత్రంబుల హోమధూమంబులనతిశ్యామాభిరామంబు లగు దరుస్తోమంబు లంబుదకదంబంబులని మనంబులం బ్రేమయూర నాడు మయూరార్భకంబుల లోఁగొను నశ్మగర్భరశ్మిచ్ఛటాచ్ఛురితంబులగు భూములం గనుంగొనియుం గవకపత్రస్థానంబులం గానన సీధుకానసలగు భిల్లపల్లవాధరులు భల్లంబులం బ్రదెళ్ళనేసిన తమనిసువులం జూచి సంజీవకరణిందిరుగఁ బ్రదికించి వానితోఁగూడి సంచరించు కాంచనగరుల్లక్షితంబులగు పక్షులనీక్షించియు, దత్ప్రాంతంబుల నతిశాంతంబులగు శశికాంతశిలాంతరంబుల బ్రకేవలం గుంభకప్రభావంబున శిలాంతరబంధులుంబోలె నిశ్చలత్వంబు నెనసిఁ భస్మితభసితోద్ధూళితాంగులగు మహాయోగుల బాగులు దర్శించియుం దత్ప్రవతజ్ఞానమహత్త్వంబు నకు నందంద డెందంబున నానందించుచు.

గీ వింధ్యభూధరమును బయల్ వెడలి యచట
నఖిల లోకైకశర్మద యైనయట్టి
నర్మదను గ్రుంకి మునిశరణ్యంబు లగుచుఁ
బొదలెడు నరణ్యములుఁ బుణ్యనదులుఁగడచి.

సీ. ప్రతివీథిసంచరత్పార్వతీచరణాంబు
జాతనూపురఝుళంఝుళరవంబు
విశ్వనాథవిహార వృషభరాజాకుంఠ
కంఠఘంటా ఘణంఘణ నినదము
పటుహారవ దభంగ భాగీరథీభంగ
సంఘుఘుమంఘుమ స్వనభరంబు
రక్షాధికార భైరవభుజా స్తంభగం
భీర ఢక్కా ఢంఢమారవంబు
సరవి నెచ్చోటమోతంబుజాటు సిరుల
కాపురంబగు నా కాసికాపురంబుఁ
దఱిసి మణికర్ణి కాదితీర్థముల నాడి,
యభవు సేవించి యచ్చట నలరుచుండ.

క. ఆ కాశీశ్వరు తా ర్తి
నైుక విలోచనము వంను నెసఁగెడు సెగలే
పై కొనియె ననఁగ లోకం
బాకులపడఁ దోఁచె గ్రీష్మ మతిభీష్మంబై.

క. పటపటఁబగిలెం గుంభిని
తటతటఁబధికులమనంబు తల్లడపడియెఁ
జిటచిటనెగసెఁ దవశిఖి
కటకట గ్రీష్మం బాకింత కనఁబడునంతఁ.

చ. బడి చనుదెంచుచాయ ధరఁ బాంథులతాపము తీర నక్కడ
క్కడఁ దరుజాలమూలములఁ గ్రమ్ముచు నిల్వఁగ దాని గ్రుచ్చుకో
వడిఁ గరపాళి యొత్తి దినవల్లభుఁ డల్లన సాఁగ నాఁగ న
య్యెడ నతిదీర్ఘభావము వహించె నహంబుల సోమహోగతిన్

గీ. అట్టివేసవి బెడిదంపు వెట్టకతన
నేల నందంద విరిసిన నెఱ్ఱెయలందుఁ
దరణిపాదంబు లెడనెడఁ దవుల నొల్లఁ
దివిచికొనిపోవ దివసంబు దీర్ఘమయ్యె.

చ. ఘనతరకీచకోత్కరముఖంబులఁ దగ్గతఘోరఫూత్కృతుల్
దనరఁగ నూఁదె యోషధికదంబకచూర్ణముఁ గూర్చి కొండలం
*గనకము సేసెఁ దత్సమయకైతవసిద్ధుఁడనంగ నెల్లెడం
గనగన మించె నెంతయు నఖండదవాగ్నిశిఖాప్రకాండముల్

చ. ఖరకిరణోగ్రతాపమునఁ గ్రాఁగి రసాతలభూమి డాఁగి సా
గరములు నింకెనో యనుచుఁ గైకొని చూడఁగ వచ్చి పోవుచుం
దిరుగు సవిస్మయం దంబుదతతిం దలపించఁగఁ జేసె నయ్యెడన్
ధరణిధరాగ్ర జాగ్ర దురుదావ ముఖోద్ధత కీలిధూమముల్.

---

* ఈధూమవేధిశబ్దవేధులకు:—

ధూమవేధీరసం పిష్ట్వా తేన వస్త్రం ప్రలేపయేత్ తతో జ్యోతిష్మతీ తైలే తస్యా వర్తిం ప్రకల్పయేత్ । జ్వలితాం తాం తామ్రపాత్రే సూపయేత్ప్రతతాంగతే । తద్ధూమగంధమాత్రేణ సర్వం భవతి కాంచనం । శబ్దవేధీ రసో రూఒసా గులికాం తేన కారయేత్ । తత్సర్వం జాయతే స్వర్ణం శ్రుతే శబ్దే నసంశయః । పాషాణవేధకో రూఒసా పర్వతానపి తేనస్త్రై, వేదయేన్నిత్ప్రాని సర్వం భవతి కాంచనం. అని మంథానభైరవుఁడు:—

ఉ. అబ్బలు వేసవిన్ ఘనగుహాంతరసీమల రేవగళ్లు మైఁ
బ్రబ్బెడు నుబ్బ సుబ్బరఁబాటలు దప్పి మొగంబు లెండఁగా
బెబ్బులు లొక్కపెట్ట నతిభీకరభాంకృతు లాచరించె నా
గుబ్బగ గొండలెండవడఁ గ్రాంకుచుఁ గూఁతలు వెట్టెనోయనన్

క. సుడిగాలి ధూళిఁ జుట్టుచు
వడిగా నందంద తిరిగె వలయంబగుచున్
బుడమియను బరణి తెఱ తిరిఁ
గెడు కరణిం జాలె నట్టి గ్రీష్మము నంద న్.

గీ. ఊష్మలత మించ నెంతయుఁ గ్రీష్మశాలి
చండమార్తాండకిరణంపు శాటి మీఁట
నెండమావులు గదలె నుద్దండ గతుల
మృగకులంబులు గని తృష్ణఁ దగులుకొనఁగ.

క. బడిఁ బఱమె నెండమావుల
నడుమ నపుడ కాలి లోఁ గనంబను నుద్య
ద్బడబాగ్నికీలముల గతి
గడుమించెన్ ధాతుపుష్పికానివహంబుల్.

గీ. పడగ సురటుల నప్పటప్పటికిఁ గొంత
ఫూత్కృతుల వేరి గాడ్పులు పొడము చుండ
బ్రదుకఁ గనెఁ గాక భోగు లప్పగిదిఁ గాక
యుండెనే నట్టి వెట్టచే నుడికిపడవె?

క. ఆతటి సలిలం బెందును
బాతాళము ద్రవ్వగానఁ బడకుండు గదా
భీతిల్లు యోగిజనులకు
శీతలకుంభకము గలుగ జీవన మొదవెన్.

సీ. కమ్మకెడెంపు లేఁగారంబు గలమోవి
కండచక్కెరపానకంబు లిచ్చి
చలువతావులు గుల్కు కలికి లేఁబల్కుఁగ
ప్రంపుఁ బల్కులను గర్ణములఁ జొనిపి
జీనిపన్నీరు నించిన యట్టి కుచకుంభ
యుగళంబు నక్కున నొత్తియొత్తి
పాటల సుమసౌరభంబులు వెదజల్లు
సొగసుఁబయ్యెదకొంగు సురటివిసరి

రమణు లెంతయుఁ దమతమ రమణులకును
దాపములుపాపి రొకకొంత తపనుఁడపుడు
తనదుపంద్రెండుమూర్తుల నెనసినట్లు
కొండ లవియంగ గండంపు టెండగాయు.

క. ఇటు లన్వేసవి యెల్లెడఁ
జొటచొట నిప్పుకలు కలుగుచో నక్కాశీ
పుటభేదనంబు వెలువడి
యటు చనుచు మునీంద్రు లవల నవలద్గతులన్.

మ. తమసానిమ్నగ దాఁటి తజ్జల సముద్యద్బాలశైవాల జా
త మహారద్యుతి తీరభూరుహవిభాధట్టంబుతోఁ గూడి సం
తమసానీకముఁ బోలె నల్దెసలు నిండంజూచి యోహో మహా
తమసానీరము నిండెఁ జెల్లదని చింతం జాల బల్కెంపుచున్.

సీ. నలువంకలకు డిగ్గి పలువంకలకుఁ జాఁకు
కొండవంకలు కెలంకులను నిండ
నొండొంటఁ దీడించు నుండ్రలఁ జంద్రల
బొదిగొన్న పేరీతపొదలఁ దాదలఁ
జదలంటఁ బెరిగినఁ జాలలోయలచాయ
జాళె యల్లిన లీల నందు వెడల
నాఁగినకో... ... ...
వలయంబుఁగోనలోనఁగలయబలసి
వెదురు ములుఁబూర్గు ములు రేఁగు వెలగ వేము
గలివెయుఁ జెలంగ దిగ్గజకర్ణములను
జెవుడుకొన ఝల్లికాధ్వని జేంద్ర మనఁగ
జీమదూలని యొక వనసీమఁ గాంచి.

ఆ. మానులచట వారిమార్గంబు గానక
వెదకివెదకి యల్ల విపినభూమి
పాపటయును బోలెఁ జూపట్టు నొకతప్పు
ద్రోవ వెంటనంటి బోవు చవల.

స్రగ్ధర.

కవిరామానీంద్రచంద్రుల్ ఘనరసవదస్పృక్స్ఫారణాముంచుపంచా
ననకోపాటోపచంచన్నఖరకులిశ భిన్నత్రుటత్తుంగభిరాట్కుం
భనివేశోన్ముక్త ముక్తాఫల సరవిసరోద్భాసి భిల్లీమతల్లీ
ధనురాస్ఫాలస్ఫురన్నిధ్వనిజనితమృగీధావనంబున్ వనంబున్.

క. కనుఁగొని యోహోహో ! యీ
వనమహిమము లేరికైన వర్ణింపఁగా
జనునే, యటంచుఁ బలుకుచుఁ
మునులందఱు నవ్వనాంతమున నంతంతన్.

సీ. తోరణంబులుగ వీథుల నారఁగట్టిన
యుప్పుగండలకు నొండొండ దిరుగు
పులుగుల ఱెక్కగాడ్పులఁ జాల నెగసెడు
పసరంపుఁ బొలకంపు ముసురుకొనఁగ
బసివట్టి నలుగడఁ బఱచిన మేకముల
పచ్చితోళ్ళను బండ్లఁ గ్రుచ్చిపెఱుకు
బలుజాగిలంబుల భౌభౌ రవంబులఁ
గొంకి పంకములోన ఘుర్ఘురించి
పరువులిడు నూరపందుల ముఱికిగవులు
చేప తట్టలఁ గదురుతోఁ జెనసిచుట్టఁ
గూఁతవెట్టిన జనుల వాకొలుపఁజేయు
భయముగొల్పెడు నొకబోయపల్లె గాంచి.

క. చుట్టును బసరపుటెమ్ముల
తెట్టలుచూచినను మదికి దిగులయ్యెడు హా
కట్టేఁడిదైవం బిచ్చటి
కెట్టు మనలఁ దెచ్చె దాఁటు టెట్లొకొ యనుచున్.

క. చండాలవాటికయు నిటు
లుండునె యీరోఁత గన్న నొక్కటఁ బ్రేవుల్
గుండెలు నిలువక వాంతికి
నొండరిగెడు కర్మఫల మహా యిటు లుండెన్.

క. నెఱి చెదర కిరాతుల ముం
దఱనైనం బోవవచ్చు దయమాలిన యి
క్కఱకుఁగిరాతుల ముందఱ
వెఱవక చనఁ బోల దిచట వెఱ పెయ్యదియో.

గీ. అనుచుఁ గరములు మొగముల కడ్డమిడుచుఁ
గోసినటువలె మనసున రోసిరోసి
వ్రాసి యుమియుచు సుడియు దుర్గంధమునకు
నాసికలుమూసికొనుచు సన్యాసివరులు.

చ. మిడిమిడిమెండ కొట్టునను మేనులు పెట్లుచునుండ నేలపై
నడుగుల దమ్ముకుమ్మువలె నంటుకొనన్వడిఘర్మతోయముల్
జడిగొనఁ గా జటల్ గడవసంబులు మోవఁగ లేకపోవ న
య్యెడనొకబోయదాయవలె నెక్కడనుండియొయద్భుతంబుగన్.

క. బడి నేఁగుదెంచి యొఱమని
పిడుగుంబలె నిప్పు లురులు బెడిదపుఁజూపుల్
గడలను జడిగొనఁ గఱువడిఁ
బొడమెడు తర్జనల నడఁగిపులుగులు బెగడన్.

చ. కటినటియించు నీలుబలుకాసెయు నల్లని మేనుఁ గన్నుఁగెం
కటి ఘటియింపఁ జేత విలుఁ గైకొని మేఘపుఁదిల్లవోలె న
ట్టిటు శరపంక్తు లడ్డముగ నేయుచు డాయుచు వచ్చివచ్చి య
జ్జటికులసార్వభౌములను సాఁగఁగ నీ కరికట్టి నిల్చుచున్.

క. నిలునిలువుఁడు మీ చేతం
గలసొమ్ముల నెల్ల నిచ్చి కదలుఁడు నాతోఁ
జలపట్టిన మిము నందఱఁ
బలుచట్టులమీఁద నుఱికి పారన్ వైతున్.

గీ. అనిన సమ్మౌనులడఁకిన నటు కిరాతు
బులుకుపులుకునఁ గనుఁగొని పలుకకున్న
బెడుసుఁజూపిన గాని యేయుఁడుగ గుడుసు,
బాఁపనపిశాచులకు భీతిదోఁప దనుచు

సీ. తొలుదొల్తఁ గుప్పి గోలలు గొన్ని పైనేసి
యవి నెట్టుపడిపోవ నోడు గఱచి
గన్నెరాకుములుకుల్ గొన్ని సూటిగఁ బన్ని
యవిపైకిఁ దేల నహంకరించి

యీ గేడుచిలుకల గోరులంటంగఁ జెంది
యవియు వస్త్రైనచో నదరిపదరి
పారావతమ్ములు పదిమైదు నిగిడించి
యదియును దప్పిపో నాగ్రహించి
యిన్ని నాళ్ళకు నాచేత యేఁటుదప్పె
నౌర ! యీజడదారుల కంపతప్పు
గలను గాఁబోలు ననుచును గరకు చుఱుకుఁ
జూపు లదరంగ నటువాని చుట్టువారి.

సీ. జటల మట్టు కుదిర్చి మెడలపై మోచేత
గుప్పుగుప్పున పారె గుమికిగుమికి
కక్షపాలలు చించి రక్షకేలను నుంచి
జడియంగ మొగములఁ జల్లిచల్లి
సలిలంబు గళగళ తలలమీఁదటఁ బోసి
బుఱ్ఱకాయల నెత్తి పొడిచిపొడిచి
కడవసంబుల రెమ్మి పెడమగ్గుగాఁజుట్టి
కూనుమోనడివీపుఁ గొట్టికొట్టి
యిట్లు బాధించి శోధించి యొందు నొక్క
పచ్చపై కంబుగాన కప్పచ్చిబోయ
నేఁటి కెరవాటు పసలేక దాటిపోయె
ననుచు వెసవారి పిసమాని యవలి కేఁగి.

గీ. వింటికొప్పునఁ జేయూది విన్నఁబోయి
యుసుగుసురటంచుఁ గలఁగుచునున్నవాని
చంద మీక్షించి యప్పు డాశాంతమతులు
మునులు పలికిరి చేసాఁచి మునికిలమున.

గీ. తాపసుల మమ్మ్రఁ బసులచందమునఁ గొట్టఁ
జేతు లెట్లాడె నిదియేమి చేటు నీకుఁ
ఘాతకుఁడఁగాఁగ నెన్నాళ్లు బ్రతికె దీవు
రాతఁ జేసిరె యోరి! కిరాత నిన్ను.

క. ఇటమునుపు నీవుచేసిన
పటుసాహసములకు నెల్ల ఫలమగు నోయీ!
జటివరుల నిటులఁ గొట్టితి
కటకట! యిఁకనైన దురితగతి మానవుగా.

క. ప్రాయము జలకల్లోల
ప్రాయము కాయంబు నస్థిరం బింక్కులకై
రోయక దురితమె తపమని
పాయక చేసెదవు నిందపరఁగఁ బుళిందా.

వ. అనిన నాలుబ్ధకుం డతిశుద్ధస్వభావుల సల్లాపయోగంబున
నుల్లంబునం గొంత శాంతి పల్లవింప వారల కిట్లనియె.

గీ. శేలదపసులార యాలిబిడ్డలకుఁగా
గాఁకనావటించ గాన విడిసి

విల్లు నంపకోల లెల్లను గైకొని
యున్న నాకుఁ బాప మొదవు టెట్లు ?

వ. అనిన నత్తాపసాగ్రణు లెల్లను వీని ననుగ్రహింపవలయు నని
మఱియు నిట్లనిరి.

క. ఓరోరి నీవుచేసిన
గోరపుఁ బాపములు నీవుఁగొడుకులు నాలుం
జేరఁ బడి పంచుకొందురో
వారికి బనిలేక నీక వచ్చునో చెపుమా.

క. అన విని వారి ముఖాలో
కనమున జ్ఞానంబు వొడమఁగా శబరుం డో
మునులార ! యిత్తెఱం గా
లిని బిడ్డల గొబ్బునం దెలిసి యేవత్తున్.

క. అదె పల్లె దవ్వు లేదిటు
కదలకుఁ డేవచ్చుదనుకఁ గాదని యువలం
గదలిన నాలాగు నెఱుం
గుదు రే కదయుంచుఁ బలికి గొబ్బున జనియెన్.

మ. చనిమార్గంబున నేణవర్గముల నేఁచం బోక లక్షించి ప
క్షినికాయంబులఁ గొట్టఁగోరకమదిం జింతాభరం బెంతయుం
ఘనమై యెక్కఁగఁ బక్కణంబునకు వేగంబోయియే చక్కఁ జ
క్కనితాటిటికి నేఁగి ప్రేకమగుకాఁకన్ వెచ్చగా నూర్చుచున్.

క. విలునమ్ములు నటువైచుచు
నలసత నొక జింకతోలునందునఁ గూర్చుం
డిల వ్రాయుచుఁ దనపాపము
దలపోయుచు నెమ్మనమునఁ దల్లడపడుచున్.

చ. కుదురుగ జంగసాఁచి చనుగుబ్బలు మీఁటుగఁ బాలుటాకుఁబ
య్యెద పొదలంగ నెన్నుదు రొకింత చెమర్పఁగ మేచకాళి నే
ర్పుదొరలఁ బాడి చందనపురోలున నేనుఁగుఁగొమ్ముఁ రోఁకటన్
బ్రిదిలెడుకొప్పుతో నెసురుబియ్యము గుప్పునిజ్రిపి దూఁగఁగన్.

క. రావే యనిపిలిచిన నది
వేవేగన్ వదలు కొప్పు విప్పను జన్నుం
గ్రేవల వలఁగొను కొపుం
దావడముల నొప్పఁ జొప్పాదవఁ జనుదెంచెన్.

వ. ఇట్లు చనుదెంచినయయ్యంగనం గనుంగొని యక్కిరాతుండు

క. ఓపడఁతి ! తానొనర్చిన
పాపంబులు దలఁప నీకుఁ బనిగలదో నా
కేపనియొ కాక చెఱిసగ
మైపరఁగునొ నాకుఁ దాఁచ కంతయుఁ జెపుమా.

క. అనవిని యచ్చెలి నగుచు
న్నను నాయక ! తలఁప నాకు నీదగు పాపం
బునకుఁ బనిలేదు నీప్రో
పున నెంతయుఁ గుడిచి కట్టి పొసఁగుట కన్నన్.

వ. తన్వులకు వారికెవ్వరికతంబున నీనెఱ వప్పుదీసి తె
త్తునో కొని తెత్తునో తెరువున్నదోఁచుచుఁ దెత్తునో జూదమాడి తె
త్తునో చని తెత్తునో యదియు దోసమొ పుణ్యమొ నాకు నేటికా
తవతవ నీన్ను దెచ్చినవి డాఁచక నంతఁగఁ బాఁకి నిచ్చలున్.

క. అనవిని మనసు చివుకురు
మనఁ గొడుకులఁ బిలిచి యట్ల యడిగిన వారుం
జనని పలికినటు పల్కిన
విని యచ్చెరు వంది చాల వెఱవెఱ నగుచున్.

సీ. మోసపోయితి నిన్నాళ్ళు నాసఁదగిలి
యాలుబిడ్డలుఁ దానుఁ జుట్టా లనంగ
నెవ్వ రెవ్వారగలే యూరికేగిత్రోవ
వీరి కేఁ బాటుపడుటెల్ల వృథయ యనుచు.

క. దోసమునకుఁ బని లేదట
నాసొమ్ములు వీరికిం దినం బని గలదే ?
రోసితి సంసారముఁ బెగ
గోసితి మొదలంట బంధుగుల తగులెల్లన్.

వ. అని తలంచి యన్నిషాదుండు సన్యస్తసమస్తసంసారుండ
గుచు నానాసుకృతవాసనావిలసితంబగు ననూనజ్ఞానామృతా
పాదనంబున మోదంబు నొందుచుఁ బుత్రమిత్రకళత్రాది
సంగమంబు తొఱంగి, క్రమ్మఱ నమ్మునులపాలికిం జని యం
దంద వందనంబులు గావించి యంజలిపుటఘటితనిటలతటుం

డగుచుఁ దచ్చరణరేణుసంస్పర్శనంబునం బావిత్ర్యస్వభావంబున నొప్పుచుండిరి? మునీంద్రులారా ! సకలకలికల్మషంబుల నిరాసం దర్శనంబునం గృతార్థుండనైతి; నాజనకుండు సఫలుండయ్యె; నాజవంజవభంజన స్వతంత్రంబగు నొక్క మంత్రంబు నాకు పదేశింపుఁడనుచు సంతసంబునం బుధపుంగవప్రాణాయామంబులా చరించిన, నవ్వాచంయములు నవ్వేదుని సవినయచాతుర్యంబునకు నాశ్చర్యంబు నొందుచు మున్ను మీవృత్తాంతంబులు నలిపెనో యాటవికుండయ్యు నవ్యక్తంబు నాశించెనం దలంచె నెంతటి ధన్యుఁడని సంతసించి, సర్వవర్ణసాధారణంబును నఖిలమంత్రఫలదంబును లోకాపవాదదోషరహితంబును దేశకాలనియమానుపేతంబును సర్వకామదంబును సుకృతాభిరామంబును మనుసార్వభౌమంబును నగు రామనామంబు కాని వీనిం బవిత్రుఁ జేయు వేఱొక యుపాయంబు లేదనియు నేతాదృశులకుఁ బ్రతిలోమంబుగా నుపదేశింపవలయు ననియు విచారించి యాదండ నొక్కతీర్థకుండంబున నక్కిరాతు సుస్నాతుఁ గావించి సంభావించి.

పంచచామరము.

కిరాత రాఁ దలంపు మాత్ర కేవలంబు భక్తిమై
మరామరా యటంచుఁ బల్కు మా యనుగ్రహంబునన్
బరాకు రాదటంచు రామమంత్ర మిచ్చి యంతటన్
ధరాధరాధిభూవిభూతి దర్శనాభిలాషులై.

క. ఘని రవ్వల నమ్ముౘులును
వనచరుఁడును వారి బుద్ధివదలక మదిలో
ననుదినము కందమూలా
శన మొనరించుచును నితరసంగరహితుఁడై.

సీ. నుదుట జేగురుబొట్టు పదనింకఁ గాదని
తులసిమృత్తిక నూర్ధ్వతిలకమిడియె
సెలసువిల్లువహించు కెలసంబుగాదని
వేణుకుండిక నొందుపాణిఁబూని
సొగసున్నవికోర సిగసూటిగాదని
నిడుదపెన్నెరులెల్ల జడలుదాల్చె
*నిండుగాటపునీలి దిండుగాదని కటి,
బలుచని నారచీరలు ధరించె
దినము తమసాతరంగిణీ తీర్థమునను
స్నానమొనరించి యత్యంత శాంతిమెఱయ
మౌను లుపదేశమిచ్చిన మంత్రమెపుడుఁ
దపము సేయుచు నక్కిరాతప్రభుండు.

క. ఈసరణి వాఁడు సకల
వ్యాసంగము మాని మౌనివర్తన నుండన్
వేసటచే వీఁడెక్కుడఁ
గాసింబడె ననుచు వానికలవారెల్లన్.

---

* నీలిదిండు "పాయిదలనీలిదిండొలికి బూడిదముండులబంటి" దశ ౫-౫ (తాళపత్రప్రతి.)

ఇంటనీవటు లేకున్న నిట్టిపనులు
కుఱుచబుద్ధతల చేసేనా ? కొలము వారు
చాల నెగ్గింప నామము చాతినుగూట
నుసూటుతనమెల్ల మాని యిట్లుండఁదగునె.

ఉ. కానకు నేఁగి వింతరుచిగల్గిన పిట్టలఁ జెట్లు గున్నలున్
దేనెలు చారపప్పులును దెచ్చుఁగదా యిఁకనంచు నాతొల్లి నో
గూనలు వోని నీకొడుకుఁ గుఱ్ఱలు నీ వను పెంచుక్రన్నోనఁ బో
పానఁగ నిల్తురయ్యెడలు హా! మముఁ బోంట్లకుఁ బాడె నన్న నే.

క. గువ్వకఱుకుట్లు మెకముల
క్రొవ్వుల బోరుగులును గునుకుగుము లేయుటయు
న్నివ్వరికూడును నింటం
బువ్వంబునఁ గుడువకిట్లు పొక్కందగు నే.

ఉ. బోయమిటారిగుబ్బెతలు పున్నమవెన్నెల పైఁట నీపయిం
బాయనిబాతి కిన్నరలు మాటికి మీటుచు నీప్రతాపమున్
హా ! యని చొక్కిపాడ వినవా కనవా మనవాఁడ బాసిని
పీయెడ నొంటిమండఁ దగవే తగవే చనుదెమ్ము ప్రేమికా.

సీ. కలుకుగుబ్బలతోనె కురువింద పేరులు
గులియుచుఁ బెనఁగొని గొడ్డిఁ జూప
దంతంబుఁగమ్మల తళుకులుపలచని
చెక్కుటద్దంబులఁ జికిలిసేయ

గసలరతనాలు బవిరులు పికిలి పూ
దంపకొండొండఁ గైదండ యొసఁగఁ
గదలుఁగొప్పుఁజుట్టుఁ జెదరిపారెను మల్లె
మొగ్గలు తెలినిగ్గు మ్రుగ్గులిడఁగ

సడలిదవిల్లుఁ గైకొని యమ్ముఁ దొడిగి
పొంచి పైవంచి నినురెచ్చరించి మంచి
మొకముఁబడనేసి నిచ్చలు మెచ్చఁజేయు
నట్టి నాయకురాలిఁ బాయఁగఁదగునె.

సీ. దుప్పులఁబడనేసి యుప్పుఁగండలు చేసి
చప్పరింపుచునుండుఁ జవులుమఱచి
మదనాస్త్రిసదలించి యదివాస్త్రిరాఁబొంచి
మొదనాటుకొనసేయు నేటుఁదుడిచి
వచ్చికస్తురిమేన హెచ్చివాసనలీన
రంగులేయుచునుండు రహిందొలంచి
మింటిమ్రాకులనంటియుంటి మ్రాకులుప్రాకి
జంటితేనెలుగ్రోలు సొంపుమాని

నారచీరలుగట్టి యన్నంబుదట్టి
గాలిమెసవుచు నాతిపై బాళిలేక
జపము వేళ్లను సెన్నుచు జాతివిడిచి
బాపలనుగూడియుండుట పాతియగునె ?

గీ. తెల్లవారిన గుండెగ్గి కొళ్లి లీల
నీళ్లమునుఁగుచు నోట తెల్లఁ జెల్లఁబోయి
నిట్రుపాసంబులనుగూడి నవ్వఁదోఁచగు
నడగు బాపన తగులునఁబడితి నేల ?

క. పతిచెడ్డ బీదబాపని
గతి నిట్లుండంగఁదగునె ? కటకట నుది ! నే
వెతనెంచన్ను మనకులముగు
మతమెంచ నొకింత రాతనులిచినా ? నిన్నుఁగా.

వ. అని యివ్విధంబున నావ్యాధులెల్ల మహావ్యాసులుంగాఁ గొని
బాధింపఁ జన్యున సాధారణాగాధ బోధ్థినిధానుంగాను
శబరనాథుం గాను.

క. కనుఁదెఱచి నవ్వి యేమియుఁ
బనిలేదని ముందుమీఱు పలికితి యిపుడే
పని కిటువచ్చితి రిందఱుఁ
జనుఁదెలుఁగుదు మీమవమాయు జరగునె ? యింకన్.

గీ. తండ్రి రాముఁడు జనకజ తల్లియెల్ల
బంధులును నాకు నాస్వామిభక్తులెన్న
నింతవాఁడను నాకింక నెదురుగలదె ?
సకలజగములు నేలుదు సుకరముగను.

క. మీరెవ్వరు? మే మెవ్వరు ?
నేరము లెంచక చనుండు నిలువక యెటకే
శ్రీరఘుపతియే నాకు న
కారణ బంధుండు గురుఁడు గణుతింపంగన్.

క. కటకట ! జననంబులు వే
రఁట గుణకర్మాదికంబు లఖిలంబులు వే
రఁట చని మెను త్రోవలు వే
రఁట యిది యటమటిపుఁగూట మనికనవలదా.

క. సతులెవ్వరు సుతులెవ్వరు
హితులెవ్వా రేటివఱద నెందేనొకచో
జతగూడిన కాష్ఠంబుల
గతి నించుక గూడివిచ్చి కదలుదు రవలన్.

క. అనియాశ విరుగనాడిన
విని యందఱుఁ జనిరి తాత వేసినగతి న
వ్వనచరుఁడు నంత నంత
ర్ఘనతరబోధావధాన రంజితుఁడగుచున్.

సీ. సరసిజాకరముల నరసిపద్మాక్షముల్
పరిపక్వముగ నేరుపఱిచి తెచ్చి
పురుషయోగ్యములైన పూసలువఱికించి
ముఖములుముఖముల మొనయఁజేసి

పరభాగములతో నపరభాగములనుంచి
నడుమ మేరువుగ రెండిడి యమర్చి
యంతరంబున గ్రంథు లమరసూత్రంబున
నూటయెన్మిదియుఁ బొందుపఱగ్రుచ్చి

యట్టియక్షసరంబుఁ జేబట్టి తనకు
మహానులిచ్చిన యదిగాక మానసమున
దలఁచి యంగుష్ఠికాద్యంగుళులను మేరు
పదముదాటక త్రిప్పి జపంబుఁ జేసె.

సీ. దినము మరామరా యని పల్కు నంతంత
యది రామనామ పర్యాయమయ్యె
నా రామనామ జపానుభావంబున
నంతర్ముఖతజూఁడ నల్లనల్ల
నల్లని మొగులోని నానాఁటఁ గనుపించె
నదియుఁ గోదండకాండాంకితమగు
సగుణభావముఁ జెందె సగుణరూపం బెల్ల
రూపింపనిర్గుణ రూపమగుచుఁ

గోటిరవిచంద్ర తేజమై కొమరుమిగిలి
నట్టి తేజంబునందును నంతరంగ
మిట్టటుచలింపక నీయక గట్టిగాఁగఁ
బూదెగఱగినగతి ననేకముగ ఘటించె.

క. అస్త్రేజంబున నెంతయుఁ
జిత్తమలయు నంతఁ గాయసిద్ధిమెఱయఁగా
హృత్తామరసము సూచుచు
నుత్తమయోగుల నుతింపనుండె నచలుఁడై.

వ. అని చెప్పిన విని యమ్మునిపుంగవు లనంతరకథావృత్తాంతం బడుగుటయును.

శా. ఉద్దాండానల చండకోపన సుబాహూచ్చండదోర్దండభూ
భృద్దంభోళిశిలీముఖక్షపిత మారీచజ్వలద్ధామ వి
ద్యుద్దామస్ఫురదాశుగా కుపిత పాథోరాశి గర్వోచ్ఛ్రయా
యుద్దామద్యుమణిద్యుతిప్రతినిధి ప్రోద్యత్ప్రతాపోదయా.

క. సుగ్రీవ భరణగుణ సా
మగ్రీ హారిదంతతాంత మానితకీర్తీ!
విగ్రీకృతశూర్పణఖా
వ్యగ్రీభవ దమరవైరి హరణవిహారణా!

మాలిని.

చిరమునీశ హృదయదేశ చిత్ప్రకాశరూప వి
స్ఫురణగణ్య జనశరణ్య భువనపుణ్యశోభనా
కరవిహార యమృతహార కలితసారకీర్తి సం
భరణలోల దిగధిపాల భణితశీల ఖేలనా!

— శ్రీ గద్య. —

ఇది శ్రీరామచంద్రసాంద్ర కరుణాకటాక్షవీక్షణ సమాసాదిత స్వతవిశేష, నిరర్గళ వాగ్వైభవాశేష సంసత్సాహిత్య[illegible]జ, సత్యసంభూషిత ముఖాంభోజ, సకలసామ్రాజ్యధురీణ, నిత్యవితీర్ణ ధారాధరాధేయ, నిరతానాగతాన్నసత్రసంతోషిత ప్రతిదినవాస పంచాశత్సహస్రభూసుర, బహువిధనానావర్తిత సువర్ణదానశైలీభవావర్తిత కీర్తిభాసుర, నిజనామాంకితానేకవస్తుసమగ్ర బహుళాగ్రహారభూషిత, చోళధరామండలని[illegible]ల సాధితసముద్రాంతరద్వీప పరిపాలనసంస్తుతప్రతాప, సేవాగత భూపాలస్థాపనాచార్య, కర్ణాటరాజపూజిత[illegible], రామసేతు శ్రీరంగవిజయరాఘవపురకుంభకోణాది దివ్యస్థానప్రతిష్ఠాపిత రామభద్రసర్వజనసంభావిత, గాంభీర్యముద్రాధిష్ఠితసముద్ర సదాశ్రితభరణదీక్షాదక్షదక్షిణసింహాసనాధ్యక్ష, [illegible] సన్నుతాసాధారణశౌర్య దిగంతప్రసిద్ధతరౌదార్య [illegible] సతతసంసేవితజనకపోషితవిద్వత్కవియూథ, [illegible]నాథ, బలవత్పరిపంథిగృహీత సామంతమహీకాంత విమో[illegible]ఘనీయబాహాబల, మూర్తిమాంబాగర్భసుక్తిముక్తాఫల, చినచెవ్వనృపాలపుత్ర, సజ్జనస్తోత్రపాత్ర, రూపరేఖావిజితకుసుమసాయక సకలధర్మసంధాయక, రఘునాథనాయకప్రణీతంబైన వాల్మీకిచరిత్రంబను మహాప్రబంధంబునందు

ద్వితీయాశ్వాసము.

---

శ్రీరస్తు.

# వాల్మీకి చరిత్రము.



## తృతీయాశ్వాసము.



జనక నందనావ
క్షోజప్రవిలిప్తమసృణఘుసృణాక్షోద
భ్రాజిత బాహాభ్యంతర
రాజ నయకలాకలాప రఘుకులదీపా !

వ. అవధరింపు మప్పుణ్యవ్రతుం డమ్మునుల కిట్లనియె. నవ్విధంబున నాశబరనాథుండు.

క. బాలునిలీల న్మత్తుని
పోలిక నితరంబు బుద్ధిఁ బొడమక యతఁ డు
ద్వేలాత్మానందస్థిర
శీలుండై ఘోరతపము సేయుచు నుండెన్.

క. అతని శిరంబున నీవృతి
వాతపటురవవహ్నిజాల మద్భుతధూమ
ప్రతతులతో నుద్ధతమై
యతనికిఁ దాపప్లవంబు నడరం జేసెన్.

చ. ఉగమున నంబుయంచుఁ జను లుల్లములం గడుఁ దల్లడంబులన్
బొగులఁగఁ గొన్ని దిక్కులఁ గపోతకపోతసమూహధూమ్రమై
పొగయుచుఁ గొన్ని దిక్కుల బ్రభూతశిఖాచయమంటమింటికై
నెగయుచు నన్నిలోకములు నేర్చెఁ దదీయతపోగ్నిమిక్కిలిన్.

క. గుజగుజలాడుచు నెడలిరి
గజగజ వడఁకుచు మహాని గంధర్వానుల్
నిజవసతులు తద్ధూమ
ధ్వజకీలవ్రజము లన్నివంకలఁ బర్వన్.

క. ఇక్కరణిఁ దత్తపోరణిఁ
బిక్కటిలిన వహ్ని లోకభీకరమగుచున్
గ్రక్కున దివి కెక్కిన మదిఁ
బొక్కి పురందరుఁడు బ్రహ్మపుత్త్రునితోడన్.

ఉ. చిత్తజవైరి ఫాలశిఖిచే జగమెల్లను వెచ్చఁ జూచెనో?
యిత్తెఱఁగంటి పట్టమున కేనిటు లుండఁగ యుండనివ్వఁడే
నెత్తులు వెట్టెనో మఱియు నేకతమో వివరింపు మయ్య! నా
కిత్తెఱఁ గంతయుం గృతరమేశ్వరనందన! బ్రహ్మనందనా.

చ. అన విని నారదుండు మది నారసి యిట్లను నో సురేంద్ర! భూ
మిని దమసానదీతటిసమిద్ధవిశుద్ధగుణప్రసిద్ధుఁడౌ
వనచరుఁ డొక్కరుండు రఘువల్లభుఁ గూర్చి తపంబు సేయుచుం
డ నతని వేఁడి మిన్ను భువనంబులఁ బొక్కఁగఁ జేసె నంతయున్.

వ. అక్రూరాతపరం డనారతసీతారమణస్మరణప్రభావంబునం జెందిఁ యనిందితాచారుం డగుచుఁ నరవిందభవాదిపదంబు లతితుచ్ఛంబులుగా నెఱింగి యితరేచ్ఛఁ దొఱంగిఁ స్వేచ్ఛత ర స్వచ్ఛంద పరమానందభూయంబును, సకలచ్ఛందోభిధే యంబును, మునిభాగధేయంబును, భక్తజనవిధేయంబును, రామనామధేయంబును, నగు నొక్కరూపధేయంబు నిరం తరధ్యేయంబనితలంపుచు నున్నవాఁడతనివలన నీకుభయంబు లేదు పురందరా! అని పిలిచి డెందంబునఁ జేయిడి సుఖం బుననుండు మనిన నొక్కింత ప్రసన్నముఖుం డగుచు శత ముఖుం డమ్మునిశేఖరుం గనుంగొని.

సీ. సముచితాభవిజృంభణము చించి మించిన
కతలు వ్రాసిన భిత్తికలు సెలంగ
సంతానమంజరీసంతానములు గూర్చి
కనుపట్టు పట్టు మేల్కట్టు లమర
గంధర్వభామినీగాంధర్వసంగతి
ఘుమ్మను పసిఁడిటంకులు వొసంగ
కడలలోకములు నిల్కడలు గన్గొన వచ్చు
రమణీయమణిజాలకములు దనర
నిర్మలప్రభ మీఱు సుధర్మయందుఁ
బట్టు నుచితాసనంబుల సురులు మునులుఁ
గ్రమ్మకొని కొల్వ ఘనవైభవమ్ము మెఱయ
నిండుకొలువున నుండి యాఖండలుండు.

ఉ. కన్నులపండువౌ నొక యగారములో రతనాలమేడ యో
రన్నను గెంపుటందు నెలతాలమెఱుంగుటరుంగుమీఁదఁ దా
నన్నలకూబరుం డును మనోహరలీలల నెత్త మాడి నే
పన్నిదమంచుఁబంతములువల్కుచునుం గనురంభఁజూచుచుక్.

గీ. నిండుకొలువుండి యమరవిభుండు నిన్నుఁ
బిలిచి తెమ్మనె రమ్మని పలుక రంభ
రమణు కై దండకొని యొయారంబుమీఱ
జగతి వేల్మిడి గైసేసి సఖులుగొలువ.

సీ. నునుము త్తియపుతీవ పనికుట్లు కనకట్లు
పట్టునన్కట్టు సంభ్రమముఁజూప
నిండు చందురుకావి నెరికెచే రంగారు
కడవన్నె బంగారు కాసెయొసఁగ
వలిచుట్టి పూదండ వెలిచుట్టు గనవొప్పు
కప్పు చిప్పిలు సామకొప్పు దనర
ఝుళఝుళంఝుళనాద హాళ హాళితంపైన
బిరుదు వజ్రపు జల్లి పెంపుడే మమర
మాటికిని మ్రోల జియడిండిమంబు మొరయ
రయము భయమును నయమును ప్రియము నమర
నమరవల్లభు కొలువున కరుగుదెంచె
రంభ సన్నుత నాట్యసంరంభయగుచు.

వ. ఇట్లరుగుదెంచి.

క. అమరీజనకరచాలిత
చమరీవాలానిలాభిచంచల దలక
భ్రమరీ సంయుతుఁడై వి
భ్రమరీతి చెలంగ హరి విరాజిలుచుండన్.

క. కనుఁగొని సమ్ముఖమునకుం
జన కటులే తెంచి వచ్చి సవినయ గతులన్
మును లోచనరుచి వీచిక
ల నీలములు వసను చుట్టులన్ వైచి తగన్.

క. కరకంకణనిక్వణములు
బెరయఁగఁ దగ్గ మ్రొక్కి లేచి పిఱిఁదికిఁ జని ని
ర్జరవల్లభు ముందఱఁ జం
దురుకావి చెఱంగుకప్పుతో నటునిల్చెన్.

క. నిలిచినఁ గనుఁగొని సురపతి
పలికెం గమలాస్యలాస్య పరిచితి నీకుం
దులలే రెచ్చట నచ్చర
చెలువలలో నిది జగత్ప్రసిద్ధము సుమ్మీ.

క. అటుఁగన ఘనకార్య మ్మొ
క్కటి గలిగిన దిపుడు నీవు గడఁగి మనోభూ
పటుశరలక్షణమగు నీ
కటాక్షవీక్షణము చేత గాఁజేయదగున్.

చ. అన విని రంభ జంభరిపునాననముం గని స్వామి! నన్నుఁ జే
సిన బహుమాన మేమనుచుఁ జెప్పగ నవ్వి సమస్తదిక్పతుల్
విని మది మెచ్చిరయ్య పదివేలువిధంబుల నట్టి నన్ను నీ
సానరఁగ దిట్టినట్టి యలయూర్వశి గర్వము నొంచిరంచలుకన్.

క. మొన్నటి యుత్సాహము నే
మన్నం దున నీప్రతాపమూఁతగఁ గానియే
నెన్నంగఁ గార్యములు కను
సన్న నె ఘటియింపలేనె ? జగములు మెచ్చన్.

గీ. అన్న మీరునాఁడు మన్నించియిచ్చిన,
బిరుదుఁ బూనియమరులఁ జూడఁగఁ
కేళిలోనఁ జొచ్చి చేరఁగ నూర్వశి
యూర్వశిథిలభావగర్వయగుచు.

క. బిరుదెవ్వరిచ్చిరే యూ
దొరకు నీకు నింక కీర్తిదొరకుంగద ! నా
సరిపాత్రవె నీ కెక్కడి
బిరుదని యెన్నుకొని నన్నుఁ జేర్కొని తిట్టెన్.

గీ. కొలువులో బిరుదు కాసెను నిలిచి లాస్య
కళలఁగలమేలు చూపంగవలయుఁగాక
వాకలదటంచు నెన్నేనివదరుచుండ
శిక్షఁజేయకయుంట యుపేక్షగాదె ?

చ. భయమఱియాజ్ఞనొండియు సభన్నిసుభంగ మొనర్తు నీపయిన్
దయగల యట్టి యర్థపతి నందనుఁడుం దలవంచ నంచులోఁ
బ్రియపడి యిండ్లనున్న దొరబిడ్డల నాడుదురే? సురేంద్ర! యీ
పయి మఱియేమివచ్చునో యపాయము నేరఁగ రాదుపిమ్మటన్.

గీ. కలవి లేనివి దొరసమ్ముఖమునఁ గల
దటంచు బలుకంగ వచ్చునె ? యమరనాథ !
హరిణియనియెడు తామరసాక్షి సాక్షి
నిలిచియున్నది యదియెల్లఁ దెలిసికొనుచు.

క. లాలించి స్వామిబిరుదులు
పాలించితి రనుచు నపుడు వదరక యుంటిన్
వాళ్ళించి విడుతుగర్వము
చాలించి సనంగ దానిసరివారు నగన్.

క. అని యిట్లు రంభ యూర్వశి
దనునాడిన పలుకులెల్లఁ దప్పక యుండన్
మునుకొని చెప్పినదంతయు
విని వెసవెడనవ్వి యమరవిభుఁ డవ్వేళన్.

క. ఔరా ! యూర్వశి గర్వము
బీరము రంభకును మెచ్చి బిరుదిచ్చుటయే
నేరమె విద్యలు దెలియన్
నేరమె తనయాటనేర్పు నేఁ డేర్పరుతున్.

వ. అని పలికి యూర్వశి నిచటికిఁ దోడ్కొని రమ్మని వేత్రహస్తు లంబనుప వారునుం జనిఁ యొక్క హాటకశిలసౌధవీధి కాంతి రాజితం బగు శ్రమకూటంబున నచ్చరచెలుల కూటంబునకు నృత్త నటనపాటవంబులుగరపు నర్తనాచార్యుం గనుంగొని నేఁడు నిండోలగంబై పురాఖండలుండు నృత్తప్రసంగంబు సేయుచు నిన్ను బిలువనంపెననిన సమ్మర్తకాశినియు నానందంబు ప్రకాశించ నేఁడు రంభాగర్వభంగంబును నేఁను మనీయానాట్య విజృంభణంబును నేర్పుసంగదా యనుచును వెడలి యుల్లంబున.

సీ. వలరాజు మదదంతి తలముల్గి గసంగఁ
కలికిచన్నులఁ బట్టుకొంచు లలిని
రతిచేతిజీనిసురఁటి యనఁగా నిడియనంగఁ
గళుకుబంగరువ్రాఁత కొసెసోఁకుమ
శృంగారఫణిఫణాభంగిఁ దానొత్తుచుట్లఁ
గప్పుమీఁ జెఱుసాము కొప్పుదనర
నంఘ్రిపద్మముచుట్టు నతివలయంబుగా
నీలాలసరపణల్ నీటుసూపఁ
బసిఁడితీఁగెకునార్చిన పటికపోలెఁ
జిటులుగందంబు నెమ్మేన జిగి దొలంక
నృత్తవేషంబు మిక్కిలి బిత్తరింప
వచ్చె నూర్వశి సకియ లిర్వంకఁగొలువ.

సీ. శివుఁడొక్కనాఁడు దేశికి మెచ్చినాఁడిచ్చెఁ
బెద్దవజ్రపుఁగుచ్చు బిరుదారవిణె
నాతండ్రిహరి యభినయము మేలనియిచ్చె
హారనీలముల కడియాలజోడు
చతురాననుఁడు సరస్వతియు గానము మెచ్చి
యొసఁగి రంచలయుంగముఁ బసిఁడికాసె
విత్తాధిపతి తాళవిజ్ఞానమరసి ప్రే
మఁజెలంగి యుభయచామరములిచ్చె

నెన్ని యేనియుఁ గలవవి యెన్ని చూడఁ
బెట్టెఁ బెట్టెఁడు బిరుదులు గట్టిపెట్టి
యున్నయవి వానినేఁజూప నొక్కనాఁడు
బిరుదు లేటికి విద్యయే బిరుదుగాదొ.

గీ. నాట్యసంగీతకళల నెన్నంగ నన్ను
రంభవోలుట యెంతదూరంబు దలఁప
దేవకులనాథ! నాయొద్ద దిక్కువడిన
పాలఁతియొన్నటికిని నన్నుఁ బోలగలదె.

గీ. తారతమ్య మెఱుంగని వారివద్ద
నుండుకంటెను నడవులఁ గొండలందు
నాకునలములు దిని యల్ల హరునినైన
మురహరుని నైనఁ గొల్చుట ముఖ్యవృత్తి.

క. వాసవ ! నాట్యంబున
వాసియెఱింగియును నన్ను వంచనచేతన్
గాసింబడఁ జేసిన నది
నీ సర్వజ్ఞతకె కొఱఁత నిలుచుం జుమ్మీ.

క. ఇఁకెదట్టిగట్టుకొని మీ
యెదుట న్నిలిచితిమి నేఁడ యిద్దఱమును గొం
తేఁదడవు మా నాట్యంబులు
పదరకవీక్షించి వాసి పరికింపుఁ డొగిన్.

వ. అని యివ్విధంబున నూర్వశి సుపర్వసింహాసనాధ్యక్షు సమక్షమంబున నధిక్షేపంబులువలికి, యంతనిలువక యంతంతకుం బ్రబలు నలుక నొకింతయు సళుకక పట్టునలంబునందిట్టుచుం బట్టుకుబుసంబు పక్కన బ్రీలనవేల ధారాళస్వేదకణజాలంబునం దరంగితంబడుచుఁ గురంగమదరంగతిలకంబుఁ గరఁగింప హృదయకుహారంబు వెడలి యాఘకోపభుజంగంబు తెఱంగునఁ గీలుజడ యిట్టటుచలింప నిలింపవల్లభుఁ జూపకయుఁ జూడఁ గనద్రిత్నరుచి రింఛోళికలు విముత్తాలంబునం పెరలెత్తఁ దత్తరంబునఁ దలయూఁపుచు సువర్ణకర్ణతాటంకసంకలితారుణమణిప్రభాడంబరంబులు ప్రతిబింబించిన చందంబునం జెందిరంబుఁజిలికినపోలికఁ గపోలఫలకంబులు జేవురింపఁ గెంపుగదురు లోచనంబులం జురచురంజూచుచుఁ గుచచూచుకంబులపయిఁగొట్టువడినహారమౌక్తికదట్టంబులు

చ. అనవిని యూర్వశీరమణి యానన మింత చెమర్ప వాలుఁగం
గొనలను గెంపుడాల్మి గుడ గుబ్బమెఱుంగుమిటారి చన్నుల
ల్లనఁజలియింప నూర్పులు దళంబుగ వెండిగఁ గ్రమ్మనయ్యనం
గుని నునువాడిపువ్వ పరిగోలవిధంబున పల్కఁబల్కెఁగన్.

గీ. వేయుగన్నులుగలిగిన వేల్పుఱేఁడు
తరముగననేర కిత్తరి బిరుదులిచ్చె
రంభవాదాను నిట్టి సంరంభముననె
జఱుఁగుగనియిచ్చె యూర్వశిసుస్థలెల్ల.

క. నాజనకుఁడు హరితత్కృప
నీజగదండమున వెలయు నింపులనొకచోఁ
దేజరిలు నొక్కదొరచేఁ
బూజగొనివ నీమగర్వమున కెనగలదా.

వ. అనిన రంభ రోషవిజృంభణ సూచనలోచనకోణాంకురిత శోణప్రభామ్రేడిత కర్ణతాటంకరత్నప్రభాడంబర యగుచు నిట్లనియె.

క. హరి మన్ననగలదంచును
గరువంబునఁ బలికె దీవు కనుగానక యీ
హరిమన్నన నాకుంగల
దరయఁగ నీమహిమలెల్ల నమఱులెఱుఁగరా.

క. ఇతఁడింద్రుఁ డతఁడుపేంద్రుం
డితనికి నతనికిని వాసి యెఱుఁగఁగరాదే

పితృభక్తి నెక్కియేనియు
నతిశయముగఁబలికె దిది యహంకృతియుగ నే.

సీ. ఆదితాళము ద్వితీయకమంతరక్రీడ
జయమంగళమ్మును జంపెలీల
చాచపుటంబు చచ్చత్పుటంబును షట్పి
తాపుత్రకంబు విద్యాధరంబు
రతిహంసలీల శ్రీరంగంబురంగంబు
కంకాళిఖండకా నాధములును
కోకిలప్రియము విలోకితంబు కుముక్ర
టెంకి త్రిభంగి మట్టెగవిజయము
నందినందన జయసంహానందనములు
మొదలుగాఁగలతాళముల్ మొనసినన్ను
గూడి కవచట్టముగఁ గొనియాడి శేని
బిరుదులివియిత్తుపికు నేబిరుదటంచు.

ఉ. భేరణీ, తండలాస్యమును, పెక్కణి, కుండలి, నాఁజతుర్విధో
దారములైన నాట్యముల యందము నల్ల నెఱింగియుండు నే
పారుచునుండ ముందు విభులాలుననైె తగునంగహారముల్
రా రసభావదృష్టులలరన్ నటియించెదె మాటలేటికిన్.

వ. అనిన నూర్వశి గర్వసింధుబంధురతరంగాయితో భ్రూభంగియ
గుచు నిట్లనియె.

క. నలినాక్షుఁ డుపేంద్రుండై
బలినడవఁగ స్వర్గమర్త్యపాతాళంబుల్
గొలువఁడె పాదత్రయి నా
యలఘుమహిమ యెవరికైన నలవడఁగలదే.

సీ. సంయుతాసంయుత సంజీవహస్తముల్
పదమూఁడు నొకయిరువదియునాల్గు
త్రింశద్గణంబున నృత్తహస్తంబులు
నైరుపక్షంబులు నైదుఘటలు
స్కంధంబులాఱును గంధరల్తొమ్మిది
జానువులేదు పార్శ్వంబులేదు
నుత్తమాంగంబు లేకోనవింశతిదశ
బాహుల్ త్రికుక్షులుఁ బదము లాఱు
స్థాయిదృష్టులెనిమిది సంచారిభావ
దృష్టులిరువది రసదృష్టులెనిమిదియును
బొంకముగఁజూపి వింతకోపులు సెలంగ
నాడఁగలిగినఁ గలహించఁ బాడిసీకు.

ఉ. అప్పుడె యేల యిప్పుడును నాఁగకమానగుగొంగు వట్టెదే?
యిప్పురుహూతుముందఱనె యిందఱుచూడఁగనీవుచూచెదే
జెప్పఁగనేల యేమనినఁ జెల్లదె విద్యలుగల్గువారికిం
దప్పక యాడుచాలునెక తాత్మియమొక్కటివింతకోపులఁ.

క. ఆడుము పిబిగువ్రులు వో
నాడుము పలుకులకు నేమి యదిగాకున్నన్
బాడుము చదువుము మిన్నక
కూడున నెటువంటిబిరుదుగొన వేమందున్.

క. అనవిని రంభ విజృంభణ
మొనరంగాఁబలికె నలుక నూర్వశి సూనా !
నినువంటి మచ్చెకంటికి
ననువగునే యిట్టులాడి యాడించుకొనన్.

వ. అని యిట్లు రెండిరయు నొండొరులమీఁదను నాటికిం బోటికిం
బాటిల్లు రోసంబున నెడనెడ హాసంబు లడర మణికంకణ
ఝణఝణరణితంబులు బెరయ రయంబునం గరంబులు
త్రిప్పుచుఁ గటాక్షవీక్షణంబులం గప్పుచు నుత్ప్రేక్ష్య
చమత్కారంబులు మీఱ నహంకారంబున.

క. మానిని యేకాశీతి
స్థానంబులమెఱసి నిలిచి దశమండలముల్
పూని నటియించు మెచ్చెద
మానసమున నీరసంబు మానకయున్నన్.

క. కరణములు నూటయెనిమిది
వరుసంగొను నీకుమెచ్చి వరమిచ్చెద నా
సరిఁగొంతవత్తువని స
త్కరణంబులు గలుగునిపుడ తగసభలోనన్.

గీ. కడఁగి షట్త్రింశదుత్ప్లుతకరణములును
హావణుగమకించి యెనుబదియాఱుగగన
భూమిచారులు గలుగు నేర్పులును మెఱసి,
శ్రమమమరనిల్చియున్న నాసాటివత్తు.

గీ. అబలయాంగికనాచికాహార్యసాత్త్వి
కములనఁగమించు నభినయక్రమములమర
నమరవిభుమీఁది దరువులహొరుపుల్ల
సరసముగఁగొను విరసంపుసరణులెల్ల.

ఉ. ఇచ్చట నేల యిద్దఱము నిప్పుడ యేఁగి సభాంతరంబులన్
మెచ్చులుపెత్తుమిష్ఠకలమేల్ప్రకటించుచు నింటఁగెల్చి యా
రచ్చనుగెల్వఁగావలయు రట్టిడిచా దిటువంటి సుద్దులే
నిచ్చినఁగాని యింకఁజలియించునె రంభ యదంభయుక్తులన్.

సీ. జలధిభంగముతోడి జనియించినట్టిసి
కే భంగమునకు నింకేలతలఁక
జలనిధిశాయికి జనియించినప్పుడే
భంగంబునీకుఁ జొప్పడకయున్నె
దళితమూర్తియగాడిన తలవంచెదవునీవు
రంభ యిందులకు సంరంభమేల
దళితమైనవిద్యయందము చూపకుండినఁ
దలవంపు నీకెపో తలిరుఁబోఁడి

యర్థపతిపట్టిఁ జేపట్టినట్టికతన
నిట్టిగర్వంబు పుట్టెనో యిదిసహజమొ
యర్థవంతునివిద్యయే యతిశయించు
నర్థమూలంపు జగమెల్ల ననఁగవినవె ?

సీ. దారుసంజీవని చారుసంగీత వి
ద్యకునుండ నీగాన మలరఁగలదె ?
వనకాంగి క్రమమె చేకొనియుండ నామ్రాఁకు
నీయభినయమింక నిలువఁగలదె ?
పుంజికస్థలశ్రీముల పుంజిగనుపించు
టుకెపూన నీపల్కు ప్రకటమగునె ?
క్రతుశుల్కదేశినిల్కడల కేననిపల్క
నీమాటపరిపాటి నెగడఁగలదె ?
వెండిమొక్కొకవిద్యకే వేఱువేఱ
రచ్చకెక్కినయచ్చరల్ మచ్చరించి
యుచ్చరించినమాత్ర నీ యొచ్చెమంచ
హెచ్చియుండఁగ నీగర్వ మెంతగలదు.

క. అచ్చరలు నేఁడు క్రొత్తగ
వచ్చిరొ ? నావిద్యఁ గలుగువగలెల్లను వా
రిచ్చల నిచ్చలు మెచ్చరొ ?
మచ్చరమింతేల తేలమాటాడుము గే.

క. అని యిట్లు రంభయూర్వశి
యును గలహించంగ నింద్రుఁ డోహో ! నిలురం
భ ! నిలువు మూర్వశి ! యని వా
రిని వారించుచును డగ్గరికిఁ బిల్చి తగన్.

క. చెలులార ! మీదునిద్యా
విలసనములమహిమ నేఁడు వింతగఁ జూడన్
వలెనె కిరీటము వెట్టిన
తలకు న్నుల్లఁ గఁబోవఁ దగునే యెందున్.

ఉ. మానినులార ! మీనటన మార్గములందుఁ బరస్పరాధిక
న్యూనత లెంచ లేఁడు హరియుం దమసాతటినిప్పు డుగ్రతం
బూనితపంబు సల్పెడుఁ దపోధనశేఖరుఁ డొక్కఁడుండు మీ
మీ నిపుణత్వము ల్దెలియ మేకొని యమ్మునిఁ లోను జేసినన్.

సీ. లోచూపుమరలించి లోచనంబులువిచ్చి
సోగమీ మొగము లే చూచుచుండ
మంత్రస్మరణమాని మానంబు కిగ్రోచి
యలరి మీంత్రోడనె పలుకుచుండ
బద్మాసనముఁవీడి భావస్థిరతఁ బాసి
మరఁగి మీ వెంటనె తిరుగుచుండ
ననశనస్థితివిడించి యనిలపూరణరోసి
మీఁదిచ్చుఫలము లే మెసవుచుండ

నలమహాముని హోమది యలరుటంప
సోనలనుముంచి తత్తపస్ఫూర్తితాప
మెల్లఁబో మెల్లనే యలయించి మీరు
చన్నుఁగొండలపై నుండఁ జన్న వలయు.

క. ఇద్దఱిలోపల నెవ్వానై
దద్దరిలక యతనిధైర్యధనముఁగొనెదు నా
ముద్దియ కే యీబిరుదుల
పద్దులుదగు నిదినిజంబు భామినులారా!

చ. అని సురనాథుఁ డాచెలులకప్పుడు కల్పకసంభవంబులౌ
ఘనమణిభూషణంబులును గాంచనచంద్రకితాంచలంబులౌ
కననగుచంద్రకాంతి నునుగాన్పులుఁగొమ్మని యిచ్చి నేఁగ భా
మ్మదినకరాబ్జముల్మొగిచియుచ్చరనెచ్చెలులిచ్చమెచ్చఁగన్.

సీ. చెఱకువిల్లసదని నెఱకుమా యీకొమ్మ
బొమవింటనలిమౌర్వి మోతుగాని
కాలంబుగాదని కళవళపడకుమీ
కలికిపాటలఁజూచి నిలుతుగాని
మొదఁగందుననుగుంది మొదవకుండుమీ
సఖిమోముచాయనే చనుమఁగాని
గందంపుఁగొండపై బొందు లేదనకుమీ
చెలియమాప్పనెత్తావిఁ బోలుతుగాని

మదనమాధవ శశధర మలయపవన
యనుచుగతిచూపి శుకపికహంసభృంగ
కేకులకు సతిపల్కులు గీతినడయు
చూపుఁగురులును బలభేది చూపిపనుప.

గీ. ఇంతమాత్రంబు మీ రానతిచ్చినపుడె
యెంతయుగ్రుండొ? యావాని యేమిమైన
నేమి నీకృపగల్గిన స్వామి యెట్టి
కార్యమైనను సాధింపఁగలము సుమ్మ.

క. మందమరుదిందుమాధవ
కందర్పాకులను దోడుగా నిడుకొని సం
క్రందన కదలెద మే మిదె
మందాకినిదాఁటి నేఁడె మహిమండలికిన్.

క. అనియనిపించుకొని సురాం
గన లమ్మునినెమ్మనంబు గరఁగించుటకున్
గినుసన్నలనె యుపాయము,
లనువుగ నూహింపుమని ప్రయాణోన్ముఖలై.

సీ. పుంజకస్థలయులంబు సమనోరమ హేమ
దారు సంజీవనిచారునేత్ర
కనకాంగి ధాన్యమాలిని వపుస్మతి శుచి
స్మిత సులోచననీల మిశ్రకేశి

దేవివిద్యుద్వర్ణ దివ్యతిలోత్తమ
　　　చిత్రసేన ఘృతాచి చిత్రరేఖ
జలజాస్యమేనక శశిరేఖ గోపాలి
　　　ప్రమ్లోచవిశ్వాచి పంచమాళ
లలితక్రతుశుల్క కర్పూరతిలక హరిణి
మొదలుగాఁగల యచ్చరముదితలెల్ల
నొనరఁ దముఁగొల్వ రంభయు నూర్వశియును
నందనవనంబునకు నేఁగి యందు నిల్చె.

క. మందారకల్పతరు హరి
చందన సంతానపారిజాతంబులచేఁ
బొందుగ భూలోకంబున
కుం దగిన సువస్తుతతులఁ గొనుచున్ వేడ్కన్.

క. నందనము వెడలి పయనఁపు
టందము గలవాదిపూఁత లలఁది తొడవులం
గుందనఁపుటంచువగ జిలు
గుం దెలిసాలియలు జారుఁగొప్పులు నొప్పన్.

చ. నడచిరి యంత రంభభవనంబున నుండెడుసోమయాజు లె
క్కుడుతమిఁ బాయలేమివడిఁ గూడఁగ రం డిఁక వాజపేయులె
క్కడిపయనంబువచ్చె మనకర్మము లీగతినుండెఁ జేఁటికిన్
జడిసెదు పౌండరీకులని సారెకుఁ బల్కుచు నెండకల్కుచున్.

క. పెంజెమటజార ద్రోవతి
పింజెలుమాటికిని గాళ్ళఁబెనఁగొనఁ గడుపుల్
గుంజెలు వెట్టఁగ వేలుపు
లంజలఁగూడంగఁజని హాళాహాళిమెఱయన్.

సీ. రత్నకంబళ మతిరాత్రులుగొంచురా
సర్వతోముఖులు వేసరఁగనేల ?
తాళవృతంబు మాపాలిది చయనులు
జగడంబులాడక చనుఁడుకడకుఁ
గపురంపుఁబెట్టె మీకట్టడయెఱుఁగరా ?
సత్రయాజులకింత చలముగలదె ?
ముత్యాలచౌకట్లు మాటమామాపాట
తెలియదే ? వాజపేయులకు నెపుడు
నాఁడెక్రతువులు రామార్పణముగఁజేయ
కునికి మేపాటువాటిల్లె మనలకనుచు
సొరిగిఁ జనుదెంచుమజ్జ్వలజూచి నవ్వి
యవ్విబుధకామినులు వారి ననిపి యచట.

క. తగువారినెంటరమ్మని
గగనంబున నడచి రింద్రుఘనసౌధంబున్
మగుడిమగుడిచూచుచు న
మ్మగువలుమఱి వారినంటె మార్గమునందున్.

ఉ. పట్టుగుడారముల్ చికిలి బంగరుప్రాఁతల చిన్ని ఁగపుం
బెట్టెలుఁ బచ్చరాపలకపీఁటలు మేలివకాసుకుట్టుమేల్
కట్టులు గ్రొత్తనెత్తపలకల్ తెరలుం బిక దారిఁ బాగుగా
బిట్టలఁగూండ్లుఁ గ్రొమ్ముఱుఁగుబిందెలుఁ గొందఱు దెచ్చిరయ్యెడన్

సీ. దంటనీలంపు చిక్కంటలు దంతంపు
దువ్వెన లుక్కుంకుమ పువ్వుఁబణపు
సకినలమంచముల్ చౌకంపుఁబొంబట్టు
బటువులు రాచిల్క పంజరములు
పరిమళంబుల యుబ్బు బరిణలు చంద్రకాం
తపుఁగోరలు విరికుందనపుగిండ్లు
నిలువుటద్దములు వీణియలు దంశియలును
దాళము ల్వేణువాద్యము లురుములు

నారజంబులు ముఖవీణలానకములు
మద్దెల లుపాంగములు స్వరమండలములు
మొదలుగాఁగల సాధనంబులు ధరించి
కొంద ఱాగిరి వెనువెంటఁగూడి యపుడు.

సీ. భృంగింబ! చెలిచూపు బెళుకులోనిలువుమీ!
మొక్కలంబుననొంటి మొక్కపోక
చిలుకచిలుకలకొల్కి పలుకులో మెలఁగుమీ!
నీరంబునను జెలి! బీరువోక

యంచయంచితయాన ! యదుగులోనదువ్వమీ !
బింకంపునమదం బింకిపోక
కోయిలకలకంఠి ! కుత్తుకై యుందుమీ !
మోడితోఁజని మొగమోడిపోక

నసుచు బలములమున్నుగా ననిచి తనకు
నెచ్చఁబలమయి మాధవ విధుసమీరు
లంటినడవంగఁ గదలెఁ బూవింటిజోదు
దండనుద్దండ పుండ్రకోదండుఁ డగుచు.

ఉ. ఇక్కరణింబురందర పురేంమసుఖుల్ చనికాంచిరెంతయుం
జక్కనిచాయ నుల్లసితసారసహంసరథాంగభృంగ స
మ్యక్కలనాద మేదుర నిరంతరతుంగతరంగ ఘోషముల్
దిక్కులనిండఁ జాంగురుచిఁదేరు సురాపగ వేడుకిద్దగన్.

గీ. కాంచి రంభోర్వశులు మదిఁగౌతుకమున
విష్ణుపదియన నీనది వెలయుఁజూవె
యిందుకుల్యల సాఫల్యమొందు మనదు
నందనంబును దీనికి వందనంబు.

వ. అని నమస్కరించి వెండియు నయ్యండజయాన లొండొరు
లం గనుఁగొని.

ఉ. కన్నమిటారి బేడిసలు కన్నులచెన్ను వహింపజక్కవల్
చన్నులచందమొప్ప జలజాతపరాగము హత్తి ప్రత్తిపూ

వన్నియలీలనొప్పఁ గనులారవిలాసిని వోలె నందమై
యున్నదియున్నదీమణితిలోత్తమచూచి తె? యెంతగొప్పనున్.

క. అభ్రకరిజలములోపల
నభ్రమువుందాను గ్రీడలాడెడుఁగంటే?
విభ్రమమున నిచటే మ
త్తభ్రమరములల్ల గండతలముల నిండన్.

చ. పగడపుఁజాయముక్కులును పాదయుగంబులుఁ దెల్లటి రెక్కలున్
జిగినునుసోగ వెన్నెలలఁ జిమ్మెడు మేనులు మించనంచలీ
గగనతరంగిణీవికచకాంచనకంజ వనీగృహంబులన్
సొగసి, రమించుచున్నయవి చూచితె? చారుచకోరలోచనా.

క. అని తన్మహిమముఁ బొగడుచుఁ
జనిచని తమసాతటంబు చాయనె గగనం
బుననుండి దిగిరినిర్ఝర
వనిత లవనితలము నవయవన్యతిగ్రమ్మన్.

సీ. జలదకదంబముల్ చంద్రబింబంబులు
శరభముల్ విద్రుమసముదయములం
శంఖసంఘములు గాంచనలతావలయముల్
చక్రవాకంబులు జలరుహాములు
మెఱుఁగుఁదీగియలుఁ గ్రొమ్మించుమానికములం
నావర్తములు సైకతావళులును
కరికరంబులు బాలకమఠముల్ మౌక్తిక
పాళికల్నవ్యప్రవాళములును

గగన జలనిధిలోనుండి కలసిమొక్క
పరియత్తారిగెరా యనఁగఁజూపరకుఁదోఁచె
గాంతశరలీల గీర్వాణకాంతలెల్ల
నీవిమెఱయంగ నవనికి డిగ్గునపుడు.

సీ. వియదంబునిధినుండి వెడలివచ్చునసేక
లావణ్యమయమాయ లక్ష్ములనఁగ
బ్రహ్మాండఖనిఁబుట్టి పఱతెంచుజీవ క
ళాకలితమణిశలాక లనఁగ
జలదబృందంబులోపల నుండి దిగువకే
తెంచు కారుమెఱుంగుఁదీఁగెలనఁగ
మిన్నేటినుండి భూమికిఁ బ్రవాలు గన్నె ప్రా
యఁపుమేలిపసిఁడి రాయంచలనఁగఁ

జూడఁదగియమరుల్లోకసుదతు లవని
కవతరింపుచుఁ దమనాతటాంచలమున
నిలిచి తమతమసారస్యములుసెలంగ
మెలఁగుచుండంగఁ బరిచారకులు గడంగి.

క. అమ్మానితపమొనర్చు వ
నమ్మునకుం గట్టెదురఁగనందగుబయులన్
గ్రమ్మికొని పొదలుపకుళకు
లమ్ముల ఘుమ్మను సమస్థలంబున నొకచోన్.

చ. సమముగ మిట్టపల్లములు చక్కఁగఁ జేయుచుఁ బట్టె నీరువా
టముఁగని నాల్గువంకల గుడారము లెత్తిరి చీలపట్టు హ
ర్మ్యములు బిగించి గూటములుఁ గట్టిపరాతుల కొప్పుమించటా
గొమరగు పైఁడితీవ పనిగుబ్బల చప్పరముల్ చెలంగఁగన్.

ఉ. అక్కడి చాయరంభయును నాశ్మసఖీమణులెల్లఁ గొల్వఁగా
చొక్కసలాము రాచిలుక చొక్కపు మేలిగుడారునందు సొం
పెక్కవసించె నూర్వశియు నిష్టవయస్యలఁ గూడి గంధవాహా
చొక్కియపుంగుడారమున నిల్చెఁ బథశ్రమముల్ వోఁగఁగన్.

ఉ. అంతట నంశుమంతుఁ డపరాంబుధిఁ జేరె శకుంతసంతతుల్
బంతులుగట్టి గూళ్ళకెగఁ బాఱెఁగ సాగె దిగంతసీమలన్
సంతమసంబు పేరె జలజంబులు డాగె రథాంగపంక్తికిన్
గంతులు దీఱె నుత్పలవనంబుల నాడఁగఁ జేరె భృంగముల్.

సీ. గగనాంబునిధిలోనఁ గనుపించుమౌక్తిక
నికరంబులనఁగఁ దారకలు నిక్కెఁ
దారకాంగనలెల్లఁ దమినాడు కుందకం
దుకము చందమునఁ జంద్రుఁడు దోఁచె
చంద్రుఁ గన్గొని పాలసంద్రంబు పైకుబ్బి
నిండెనాఁ బండువెన్నెలలు గాసె
వెన్నెలబైటఁ గర్వించి పంచశరుండు
కలువపూవులను లక్ష్యంబు సేసె

గలువతూపులమర్మము గాడఁబెదరి
పదరిమెత్తనిరాకుఁ బాన్పులందు
బల్లవులఁ గౌఁగిలించిరి పల్లవోష్ఠు
లలఁతి తెమ్మెరనెమ్మేని యలఁతదీర్ప.

చ. నిలిచిన తేటవెన్నెలలనీడలు చూచుచుగట్టి వెన్నెలల్
జిలుగుమెఱుంగుముక్కుతుదఁజించిమెసంగుచుదప్పిగప్పినం
బలుచనితియ్యవెన్నెలల బానముసేయుచుఁబ్రేమడాయుచున్
మెలఁకువమించనయ్యెడ రమించఁదొడంగెఁజకోరదంపతుల్

క. ఇమ్మాడ్కి జనానందక
రమ్ముగ వెన్నెలలుగాయ రంభోర్వశులున్
గుమ్మెతగుడారములకడ
ఘుమ్మను కపురంపుజగతిఁ గూర్చుండి తగన్.

గీ. దండియలు మీటి రహిగానదంతిచెలఁగ
నింద్రుమీఁదటిపదము లెన్నేని వింత
వర్ణములఁబాడి యుత్పలవాసితంబు
లైన గంధోదములు గ్రోలి హాళిదేలి.

ఉ. చొక్కుచునచ్చటన్ముదముసొంపునసోలుచునుండియంతటం
జక్కనిపై డితీవపని చప్పరమంచములన్ వసించి రిం
పెక్కఁగ నూడిగంపు జెలు లివ్వల నవ్వలఁ గంకణధ్వనుల్
పిక్కటిలంగఁ దాళగతి లీలలుహత్తి పదంబు లొత్తగన్.

సీ. ఇటులవ్యాధూతులు పటుగృహంబులలోనఁ
బవళించిమహానితపంబుఁ జెలుప
నెద్దియుపాయంబొ ? యద్దివ్యసభయందు
మనలకుఁ గీర్తిగల్గునొకో ? యింక
ననిపల్కుచొక్కింత కనుమూసిరో మూయ
రో యంతటనె తూర్పునను వేఁకఁ
జుక్కగన్పించె పక్షిక్కులు చెలువెక్క
నరుణోదయంబయ్యె విరులువిరిసెఁ
గుక్కుటంబులు "గొక్కొరో కో"యటంచు
క్రోసెఁబక్షులకలకలంబులు చెలంగ
వనజములువొల్ల ముకుళభావములువదలెఁ
గదలెఁదమజోడుగూడఁ జక్కవలువేడ్క.

క. ఉదయించె సూర్యుఁడంతట
నుదయాహార్యంబునెల్ల నుగ్రసహస్రా
భ్యుదితారుణరుచిమేలిమి
యుదిరి పసిఁడికొండ పగిది నుండం జేయుఁ.

వ. ఆసమయంబున.

క. ఉప్పవడంబై వేలుపుఁ
గప్పురగంధులును వేడ్కఁగై సేయుచు నేఁ
డప్పరమమానియుండెను
చొప్పరయుదమనుచు నడుచుచును దమలోనన్.

క. గ్రక్కునఁ జనరా దచటికిఁ
జక్కఁగఁ గుసుమాపచయ మిషంబున సొంపుల్
నిక్కంగఁ బోయి యతనిం
జొక్కింతము మానులింత సులభులె ? తలఁపన్.

క. అని పల్కుచుండినంతకు
మునుపె వసంతుండు పికసమూహము పొగడన్
మనసిజుఁడు నెగడ మలయాప
వనసహితుండగుచు నచటి వనముల నిల్చెన్.

సీ. మోదుగుల్చిగిరించె గేదఁగుల్ననలొత్తెఁ
గురువిందములుఁ గలిగొట్లుఁబూచె
మల్లియల్ గొనసాగె మొల్లమొగ్గలునైచె
మావులు గ్రోవులు దావి నెసఁగె
పొగడ పుష్పాళిరాల్చెఁ బొన్న తేటలఁబొల్చె
నిమ్మయు గోఁగుఁదేనియలు గురిసె
సంపెఁగ ల్వికసించె జాదుల్మదాళించె
గోరంట తిలకంబు గుత్తులెత్తె

వావిలియుఁ బ్రేంకణంబును వంజులంబుఁ
గడిమి చెట్టులు నలరె నప్పుడు వసంత
సన్నిధి విశేషమున వనస్థలమునందు
భువియు దివియును ఘుమ్మని పొదలుచుండ.

వ. ఇవ్విధంబున వసంతంబు శుకపిక శిలీముఖ ముఖరితాశాముఖంబు దిగంతంబగుచు విజృంభించుచుండ.

ఉ. చందురుకావిపావడలఁ జూజి పిఱుందులఁ జంద్రకాంతఁగా
గందుపిసాళి పాళియలుగట్టి కదంబపుఁ బూఁత తావికిం
జెందిన తేఁటిదాఁటులనఁ జెన్నగు కీలుజడల్ నటింపవా
సుందరు లందఱున్ వనము సొచ్చి చలన్మణినూపురంబుగన్

ఉ. కేరుచు సవ్వధూమణులు కేళివనిన్ విహరించి కొంతఱిం
జేరుచుఁ గన్నెగేదఁగులఁ జీరుచుఁ బూబొదరిండ్లు వేసవిన్
దూరుచు రాని నెచ్చెలుల దూరుచుఁ గమ్మనిపువ్వుఁదోఁటలోఁ
గూరుచు సారసౌరభముఁ గూరుచుచల్లనిగాడ్పుఁ గోరుచున్

రగడ.

నిచ్చ నిచ్చగ నలరుదండలు నిండ నిండ యనుంగుఁ జెలులకు
విచ్చ విచ్చన విడివిరుల్ గురువింద విందొనరించె నెఱులకుఁ
గలికి కలికిలతలచు దూస్మద గంతు గంతులు చూపుమాటికిఁ
జిలుక చిలుకల కొల్కి పలుకులఁ జిక్కఁ జిక్కులఁ జెప్పనేటికిఁ
గంతు కంతుకము లనఁదగునిది గాదె గాదెనుమిసులుగుస్తునె
చెలియ చెలియల నీకు నేసన జిర జిరఁగదిలి చెంత వత్తురె
చిలువ చిలుప మరందరసముల జెట్టచెట్టల పిద్య మత్తురె,
కన్నె కన్నెర చేయనేటికి గానఁగా నవమల్లి మొగడలు
నన్ను నన్నున నీకుదగునటె నవ్వ నవ్వల తేనెపొగడలు
మోదు మోదుగ పువ్వు లెచ్చెను మున్ను మున్నర నైకముచ్చిరి

యేమయేమనవచ్చు నెచ్చెలి కీరకీరము వినుమునువ్వ
రాలరాలగరుల్వ్రాలిపిసిగ రాఁగరాఁగతి మేమీఱుగాఁగ
యరసియరసికతాతటస్థలి యందమందముగ వలయుచోఁ జేగఁ
సరసిసరసిజములును గొనుచుఁ దుమ వసంతసంతత కేళినీరాడఁగ.

క. అనివనిలో విహరింపుచుఁ
జనిచని చంద్రముఖు లిష్టసఖు లిగురుకోలం
గనిమనికొలువఁగ నట య
మ్మునిని యునికికి నేఁగ యరసిసుందఱు నేర్కన్.

ఉ. తేనియ క్రొన్ననల్ పసిమి తియ్యని తియ్యని పండ్లు మేలుఁగా
గానుకగాఁగనుంచి పదకంజములం బ్రణమిల్లి తేది యో
మానివరేణ్య! పుణ్యమహిమన్ మముఁగన్గొనఁగల్గెసత్కృపా
నూనకటాక్షవీక్షణము మాపైఁ జేయుము మమ్ము నిత్యకేన్.

క. అనిపలికి యతఁ డొకింతయుఁ
గనుదెఱవక పలుకకున్నఁ గని సుందఱు నె
మ్మనమున నచ్చెరువందుచు
మునుపెన్నఁడు గానమిట్టి ముని జగములలోన్.

క. గట్టిగను మూఁగదయ్యము
వట్టినదో కాక చెట్టొ బఱురాచట్టో
యిట్టులు మనమిందఱమును
జుట్టంబిలువఁగ నొకింత చూపక యున్నే.

సీ. హారనీలములతోడ సరినీటుపచరించు
కప్పుఁదేరెడు నునుగొప్పుగొప్ప
మీఁటేరుపడి మంచి కోటేరు వెట్టిన
మురువుచూపట్టెడు ముక్కుటెక్కు
పాలుగారుచుఁ జంద్రు మేలుగానఁగఁ గొప్పు
మోహనంబగు నగుమోముసోము
వాటమౌ రత్నకవాటమౌ నిదియనఁ
జాల శోభిలెడి వక్షంబుడంబు

తళుకుబంగరుముప్పిరి తరఁటుచాలె
నున్నయదిమేను చూడంగ మున్నితండు
విటుఁడయుచరించి కొన్నాళ్ళ వెనుకఁదపసి
యయ్యెఁగా కిట్టి యందమొందునె ననఁగలదె.

క. కనమే బిగాన నల్వా
రినపచ్చవిమొదలు జేగురించిన జడలుం
బెనువంకమెడలుగల య
మ్ముని జడలున్ సొంపు లెసఁగ ముల్లోకములన్.

క. యువతులసంగతులం గల
చవులెఱుఁగఁడు పుట్టుమొదలు సత్యముగా దే
నవలాలచూపుదలలన్
దవులనివాఁడుం గలాఁడె ధైర్యముతోడన్.

వ. అని యందఱు నన్నివిధంబులం బలుకుచుండ రంభ యిట్ల
నియె.

క. మద్దెలసద్దున సీతని
నిద్దురము బ్బెల్లఁ బోవ నేర్పు మెఱయ నే
నిద్దముగ దేశిఁ గొనియెద
నొద్దికగానుండుఁ డనుచు నొసరిచి సఖులన్.

క. బంగరుకాసెయు ముత్తెపు
రంగుల చనుకట్టుఁ బూని రంభ మిగుల నై
సింగారము నెలయఁగ ముని
పుంగవు నెదుటన్ మెఱుంగుపోలిక నిలిచెన్.

సీ. నిలిచి యటునడిచి పుష్పాం
జలిచేసి యసంయుతములు సంయుతహస్త
ములుచూపి పసిఁడి గజ్జెలఁ
జెలఁగెడు చరణములు రవళిసేయుచు వేట్కన్.

క. తరుణీమణియొకర్తు తంబురా మొరయించ
వెలఁదియొక్కతె ముఖవీణ యూఁద
సరసిజాక్షియొకర్తు స్వరమండలము వాఁచ
బోఁటియొక్కతె దండ మీటి పాడ
విమలాంగియొక్కర్తు వీణె యుపలికించఁ
గలికియొక్కతె యుపాంగంబు పూనఁ
గిసలయాధరయొకర్తు కిన్నరమీటంగ
లోలలోచనయొకర్తు తాళమొత్త

మఱియుఁగొందఱు సుదతులు మద్దెలయును
నాదజము మొదలైన వాద్యములువట్టి
శ్రుతులుఘుమ్మని వాయించె నతివదేశి
నృత్తవైఖరిచూపె మునీంద్రు నెదుట.

ఆ. ఇటుల మిగుల నేర్పు ఘటియిల్లఁజూపిన
నృత్యగీతవాద్య నిపుణమార్గ
పటిమ చెవిటిమ్రోలఁ బాడినసంకునా
ఫలము లేకపోవ బదరి రంభ.

సీ. ఒకకోపుచాలదే శుకవామదేవుల
కైనను దపము వాయంగఁజేయ
నొకచూపుచాలదే సకలదేవతలను
మోహమహాంబుధి మునుఁగఁజేయ
నొకపాటచాలదే యుర్విలోశైల సం
ఘములు నీరుగఁ గరఁగంగఁజేయ
నొకమాటచాలదే యుల్లోలకల్లోల
ముగఁ దేనెవంకలు నిగుడఁజేయ
బూనియిటువంటిబిరుదు కోపులును బెళుకుఁ
జూపులును వింతపాటలు సొగసుమాట
లు రహినెన్నిచూపిన మదిగరఁగదయ్యె
దయ్య మేమనిపుట్టించె నయ్య వీని.

వ. అని మఱియు ననేక ప్రకారంబులఁ బలుకుచుఁ దననటనా
చాతుర్యంబున నతిధైర్యంబునుఁ దన విలాస భావంబున
నతిజడభావంబును దేజస్తిమిర సంపర్కంబునుం బోలెనొ
క్కాంతి యలంబొందు వడకయున్న సౌందంబునం గలంగను.

గీ. చిన్నబోయి రంభ చెక్కిటఁ జేయిడి
యున్న జూచి యంత నూర్వశియును
నేనొకింత దడవుగానంబుచే మాని
మనసు గరతు ననుచు ననుచు వేడ్క.

చ. సరిగ మెఱుంగుఁ జంటకుబుసంబునఁ జక్కవపిక్కటిల్లు ను
త్తరమగు కావిపింజియపదంబులఁ జిందులుద్రొక్క బన్నస
ప్పురమున హెచ్చుకుంకుమపుఁ బూతసుగంధము గ్రమ్ముమొల్లపూ
విరిసరులన్ సిరుల్లోలకు వేణిచలింపఁగ వచ్చి నవ్వుటన్.

క. మునికట్టెదుర నొయారము
దనరఁగఁ గూర్చుండి యొక్కతరుణీమణిఁగ
న్గొని వీణియఁ జెమ్మని చ
క్కనిపలుకులఁ దేనెలొలుకఁగాఁ బలుకుటయున్.

సీ. తళుకు నీలపు దట్టములువోలె నీడలు
గానంగఁ దగు గుబ్బకాయలమరి
రతనాల పూసల రాజిల్లెడు సిరాజి
పగడంపు మెట్టులజిగి వాలంకఁ

ప్రచుర రాగ లతాంకురములు ప్రాకినలీల
మెఱుఁగారు తంత్రులు మీటుచూప
ఘుమఘుమ ధ్వని నించు క్రొవ్విన యపరంజి
కళుకుల యనుసుల గొళుకు దనర
జీవ రత్నంపు మేరువు చికిలి కెంపు
బిరడలును గరుడ పచ్చల కరివెజీవి
వ్రాత హరాంబట్టు గవిసెనరాణ దనరు
వీణె యొకయింతి నిల్చెను వెలఁది యెదుట.

వ. ఇట్లు తెచ్చిన విపంచికి నమస్కరించి పాణి యుగంబునఁ గైకొని.

సీ. గవిసెన సడలించి కరపంకజద్యుతి
గడలు కోఁజీని పావడలు దుడిచి
బలితంపు మెఱుఁగు గుబ్బలమీఁదఁదీర్చిఘు
మ్మన నఖంబుల శ్రుతులంటిమీటి
జవ్వాదిఁ బదనిచ్చి సారణు ల్సారించి
సరసత బిరడలు చక్కనొత్తి
మంద్రమధ్యమ తార మహిమమీఱంగఁ ద్రి
స్థానంబులును ముట్టి తాళగతుల
నతులకంకణ ఝుణఝుణత్కృతులు సెలఁగ
మాయురే ! యన రాగముల్ తాయములును
గీతములు ప్రబంధములు రక్తిఁగానుపించ
వీణెమీటెను నాసీలవేణి యపుడు.

మ. లలనారత్నము గానమాధురికి శైలంబుల్గరంగన్ మృగం
బులు మేపుల్విడి నాదమందె నచల న్మూర్ధాగ్రకర్ణంబులై
చెలఁగన్ బక్షిగణంబు మ్రోఁతలుడిగిర్చెన్ మౌనిచందంబుని
శ్చలభావంబున నంతకంతకుఁగడున్ సంధించెఁ గానత్యమున.

క. అదిగని యూర్వశి నవ్వుచు
నదిరామది జాయివంటి దనియెను పలుకుం
బెదరె నుపాయనమొక్కటి
వెనుకవలయు వీనిమదికి విశ్వములోనన్.

శా. ఔరా రాగము బాపురే యొసఁగు గాయంబుల్ బళి! స్థాయిసం
చారిప్రాపులు లెస్స కంపితము గ్రామాగ్రాంగో...ములన్యా...తమా
ధుర్యారే మీటు కాలంబు పాడఁదగునా హా రక్తియుం దట్ట సభా
స్తారుల్లేరిట మెచ్చ నిజముఁ మెచ్చన్ నేర్పు చే గానమున్.

క. అనిపాక్కలికి రంభం
గనుఁగొని మనతగవుఁదీర్చెఁగా మునితప మే
ఘనులతపంబులు చెఱుపం
బనిచిన నీక జనఁగవలదు పనివేళై నన్.

క. అప్పుడుఁజెల్లెలు బలె మన
మెప్పుడు నీకేఁగూడియుంద మిద్దఱముచు సొం
పొప్పనని వారు పాళియ
మప్పుడె మొత్తివడి నరిగి రమరావతికిన్.

వ. ఇత్థంబున రంభోర్వశులు తమ యఖర్వగర్వాంధకారంబు మునిలోకబాంధవు తేజఃప్రభావంబున దూరంబగుటయు నిర్విణ్ణహృదయలై సుపర్వరాజధానికింజనిన యనంతరంబ యనంతశాంతిగుణమణిఘనీభూత తపోధనుండగు నాఘనుం డచ్చోటికి నాయచ్చరమచ్చెకంటులు వచ్చుట పోవుట లెఱుంగక యభంగధ్యాననిష్ఠాగరిష్ఠుండై చెలంగుచుండ.

సీ. సంచారమా చెంత నించుకంతయు లేమిఁ
జెదలుఁ బ్రువ్వలు నేల మొదలఁ దోడఁగ
జెదలుఁ బ్రువ్వలతనిఁ బొదుగ బుట్టలు వెట్టె
బుట్టక్రోవులలోనఁ బుట్టెఁ జెట్లు
చెట్లయందే ప్రవేశించి నాల్కలుఁ గ్రోయు
పెనుబాములను దీఁగెలును బెనంగ
దీఁగెలంతంతట దిరిగి గూడులు గట్టె
గూడులలోనఁ బక్షులు సెలంగె
నంతరాంతరములయందు దంతిసింహ
శరభశార్దూలసింహంబు లిరవుకొనియె
పార్థివకళేబరంబు లోపల వెలుంగు
నంతరాత్మయుఁ బలె నతఁడందునుండె.

క. అటుసప్తర్షులు హిమవ
త్కటకవినోదములు చూచి క్రమ్మరి తమసా
తటమునకు వచ్చి యచ్చట
నటు నిటుఁ గనుఁగొనుచు వారలందఱుఁ దమలోన్.

ఉ. శుష్కవనంబు మున్నిచటఁ జూడఁగ నేఁడిది వింతవింతలై
పుష్కరిణీరసార్ద్రకణపూరిత శీతలవాతపోతకా
విష్కృతపుష్పవిస్ఫురదవేల రసాల మరందకందళీ
పుష్కరనిర్ఝరుల్ మిగులఁ బొల్పువహించె మనోహరంబులై.

సీ. ముందుకోరెంద లేకందు మొంగును నందు
నల్లనేరెడు లెన్ని యల్లుకొనియె
మున్ను సన్నపుటీఁత ముద్దులీ చెంగట
సురపొన్న గుంపము గ్రొంపమయ్యెఁ
దొల్లి యంతటదంతె దొంతరలీ చెంతఁ
దీయమామిడులెన్ని మాయ పెరిఁగె
మునుమున్మురపుఁదుమ్మె మునుఁగంపులీవంక
బలువేరుపనసలు బలిసెఁ జాల

నాఁటిఋతువులఁ బుష్పంబు లలరుచున్న
వెంతవింతలు మనము నేఁడేమలయ్యె
హిమగిరికిఁ బోయి యింతలో నెన్నిపుట్టె
దేశకాలవిశేషము ల్దెలియ వశమె.

సీ. పులుమేపులును మాని పులులవీపులు మెట్టి
గునిసియాడెడు లేటి కొదమలిచట
దమినీలకంఠకంఠముల హారంబుల
బాగుజూపెడుఁ గోడెనాగులీవ

సింగంపుఁగూనలఁ జేపట్టియాడుచు
నున్నవియేనుంగు గున్నలిందు
ముంగిసల్ మూషికంబులు నొక్కదిక్కునఁ
జెర్లాడుచున్నవి చెంతఁగూడి
యింతవింతదలంపఁగ శాంతిమంతు
డెవ్వఁడో యొక్కయోగి యీయెడవసించి
తపముసలిపెడుఁ గాఁబోలు నిపుడుగాక
యుండునే యిట్టి మహిమంబు లొనరుటెట్లు.

వ. అని పొగడుచు మఱియును.

క. ఇక్కడఁగాదే మనలన్
ముక్కపటిచె నొక్కబోయ మును మునుకొని వా
డెక్కఁడబోయెనొ యిపుడన
గ్రక్కునవాకాశవాణి గంభీరముగన్.

క. ఈవల్మీకంబున నదె
శ్రీవల్లభభక్తసులభు సీతారమణుఁ
భావింపుచు నున్నాఁడనఁ
గా వారలరాక యెఱిఁగి గ్రక్కున నతఁడున్.

శా. ఆవల్మీకముఁజించికొంచు నుదయాహార్యాంతరాళంబు నం
దావిర్భావమునొందు భాస్కరునిచాయన్ శోణశోణప్రభా
వ్యావల్గత్కిరణంబులోయన జటాప్రాంతంబు శోభిల్లఁగా
వేవేగంజనుదెంచి యమ్మునుల సేవించెన్ బ్రియంబిచ్చఁగన్.

క. సేవించి నిలిచి యంజలిఁ
గావించి మునీంద్రులార ! కరుణాంబుధులా
రా ! వినుఁ డీ మీవలనం
భావనభావంబుఁ జెంది మాన్యుఁడ నైతిన్.

వ. అనినవిని యమ్మునీంద్రులందఱు నానందంబున.

క. ఈజట లీ కృష్ణాజిన
మీజపమాలికయు శాంతిమిన్నులుగలిగెనో
యీజగదీంగకు నో పరా!
శ్రీజానిస్మరణమహిమ సెప్పు న్వాశమే.

సీ. ధరనెన్ని పుణ్యతీర్థములైనఁ గలుగ నీ
రామనామము సరిరావు దలఁప
నిర్మలస్థితినిడించు నిధులెల్లఁగలుఁగ నీ
రామనామము సరిరావు దలఁప
నానావిధములైన దానము ల్గలుగ నీ
రామనామము సరిరావు దలఁప
నతిశయంబుగమహావ్రతములుగలుగ నీ
రామనామము సరిరావు దలఁప
రామనామంబె సారంబు రామభద్ర
రామచంద్ర రఘూద్వహ రామ యనుచు
ననయము జపింపవలయు దక్కినవియేల
రామనామంబునకు సరి రావుదలఁప.

వ. ఇదియంతయు రామనామస్మరణంబకాని వేఱొక్కటిగా దెట్టి పాపిష్ఠుండైన నిష్ఠాగరిష్ఠుఁడగుచు శ్రీరామస్మరణంబుసేయ సకలభోగంబులు గలుగుట నిస్సంశయంబు. వీఁడు ప్రహ్లాద నారద పరాశర వ్యాస పుండరీకాదులలో నొక్కఁడుగాని సామాన్యుండుగాఁడని సన్నుతింపుచు సముచితంబుగా వాని వీడుకొని యథేచ్ఛం జనిరి. వాఁడు నవ్వల్మీకంబునం బుట్టుట కతన వాల్మీకియను నామధేయంబు వహించె నవ్వాల్మీకి మహామునియు నంతకంత కంతరంగంబున నుప్పొంగు భక్తి విశేషంబున నిరంతర జపశీలుండై యుండ నతని చిత్తశుద్ధికి నలరి రామభద్రుం డొక్కనా డతని యగ్రభాగంబున.

సీ. కోర్కెలపంటగల్గుటకు వ్రాలెడుమేఘ
మనఁగ వినీలకాయంబుమెఱయ
ప్రాణతులకాయువుల్ వ్రాయు తూలికనాఁగ
వాలిక తూపొక్కకేల నమర
హస్తవైశ్యముచూపు ననువునఁ గాంచన
ఘనకార్ముకము భుజాగ్రమున వ్రేల
నీలాద్రిమేఖల నిండారునీరెండ
చెలువునబంగారు వలువదనర
మహితకరములజిగిగండమండలమున
దాండవముజూప నుద్దండపుండరీక
పత్రరుచిహిండనంబులఁ బాలువెట్టు
ప్రాలుఁగన్నులఁ గృపమొల్కఁగానుపించె.

సీ. పసిఁడిగింటెంపుఁగావ్పుటెకప్పు లోఁ హొంగాహొంగా
కమ్మకస్తూరితిలకమ్ము భళిర
శరచాపములుఁబూను సరవియమ్మమ్మ మా
ణిక్యకోటీరంబు నీటుఁబాపు
నిగనిగమనుచిన్న నగవులాహా మణి
మకరకుండలముల మహిమ మేలు
తళుకుగుంకుమపు గంధపుఁబూతయుఁ బ్యారె
హారవల్లికల దొయ్యారమహార
మించనననెంచఁదగులీలఁ గాంచి మంచి
మించిజిగిమించు నెమ్మేని మెలఁతగూడి
చల్లఁజూపులఁ గరుణారసంబుఁ జల్లి
జల్లుచును నిల్చె శ్రీరామచంద్రుఁడెదుట.

గీ. జానకీజానియిట్లు సాక్షాత్కరింప
నత్తపస్వియు నానంద మత్తచిత్త
వృత్తుఁడగుచును నతులుగావించి లేచి,
కరయుగంబు నిటాలభాగమునఁ జేర్చి.

సీ. జయదశరథ సుధాజలధిరాకాచంద్ర
జయ తాటకాభిధా చటుల బాణ
జయగాధినందన సవనరక్షణదక్ష
జయసుబాహుబాహుత్వ్రాహ శమన బాహ

జయగౌతమాంగ నాశాపవిమోచన
జయకృతానంగ జిచ్చాపభంగ
జయభూమికన్యకోపయమ లీలాలోల
జయవాలి నిగ్రహాశ్చర్యశౌర్య

జయపయోనిధిలంఘన జాంఘికబల
జయదశాననఖండనచండకాండ
జయవిభీషణపోషణాసక్తచిత్త
జయయయోధ్యాభిషిక్త శ్రీ జనకజాప్త.

ఉ. శ్రీరఘురామ భానుకులశేఖర మీపదపద్మసేవ మం
దారనగంబు ముంగిట నిధానము తంగెటిజున్ను కొంగుబం
గారము వేల్పుమానికము కైవసమైనధనంబు చేరువా
మేరువు కామధేనువు సమీహసుధాంబుధి మాకునెప్పుడున్.

సీ. కట్టఁగాలువకదా కల్లోలినీభర్త
చెఱకుఁబట్టెముగదా శివునిధనువు
కలువరేకులజోక గద సప్తసాలముల్
పలుకుటీగిమొఁగదా తలఁప లంక
కందుకంబుగదయ్యె దుందుభికాయంబు
కాలగీరినబొమ్మగద యహల్య
నూటికంబముగదా సురవైరిదేహంబు
పెట్టుఁజెట్టుంగదా విభీషణుండు

తెరువునకు నడ్డమగా లేఁతతీవఁ ద్రుంచు
కరణిఁగద కబంధభూజవిఖండనంబు
నీకు నీమహత్త్వంబు వర్ణింపఁదరమె
ప్రకటగుణసాంద్ర దశరథ రామచంద్ర.

వ. అని సన్నుతించిన సంతసించి రామభద్రుండు నిర్నిద్ర తాత్ప ర్యంబున నమ్మునివర్యుని మస్తకంబున హస్తస్పర్శనంబు గావించి యోమునికులతిలకా! నీభక్తికి మెచ్చితి. మచ్చరి తంబు భవ్యంబగు కావ్యంబుగా నొనరింపుమని యానతిచ్చి చనియె. అంత నవ్వాల్మీకిమహాముని యు నాజానకీవల్లభుని భక్తి సులభత్వంబుఁ గొనియాడి సుధాబిందుబంధురతరంగ రింగణాధార ధౌరంధరనిరు పీణీ మృదులపద సందర్భరస గర్భితార్థ చమత్కార పారాయణంబుగా రామాయణంబు వక్కాణించె నట్టి రామాయణంబు సకలలోక ప్రసిద్ధంబగు టెఱుంగుదురే కదా! ఇంక నేమివినవలతురని యడిగిన నమ్ముని పుంగవులందఱు నప్పర్వతుం బూజించి నీవలననిట్టి పుణ్యకథ వినంగలిగె, కృతార్థులమైతిమని సన్నుతించి వెండి యుఁ దత్కథావిశేషంబు ప్రశంసించుచుండిరంత.

క. శ్రీకరమై తగు నవ్వా
ల్మీకి చరిత్రంబు భక్తిమెఱయఁగ నెపుడున్
జేకొని జదివిన వినినన్
జేకురువారల కభీష్ట చిరశోభనముల్.

—గద్య.—

ఇది శ్రీరామచంద్రసాంద్ర కరుణాకటాక్షలబ్ధ సిద్ధసారస్వతవిశేష, నిరర్గళ వాగ్వైభవాశేష సరససాహిత్యకళాభోజ, సత్యసంభాషిత ముఖాంభోజ, సకలసామ్రాజ్యధౌరేయ, నిత్యవితీర్ణ ధారాధారాధేయ, నిరతావారితాన్నసత్రసంతోషితప్రతిదివసపంచాశత్సహస్రభూసుర, బహువారావర్తిత మహాదానవైభవావర్తిత కీర్తిభాసుర, నిజనామాంకితాకలంకవస్తుసమగ్ర బహుళాగ్రహారభూషిత, చోళధారామండలనిఖిలభోగవిభవనిర్జితాఖండల నాథతసముద్రాంతరద్వీప పరనృపాలసంస్తుతప్రతాప, నేపాళభూపాలస్థాపనాచార్య, కర్ణాటరాజపూజనీయధౌరంధర్య, రామసేతు శ్రీరంగవిజయరాఘవపురకుంభకోణాది దివ్యస్థలప్రతిష్ఠాపిత రామభద్రసర్వజనసంభావిత, గాంభీర్యముద్రావినిర్జితసముద్రసదాశ్రితభరణ దీక్షాదక్ష దక్షిణసింహాసనాధ్యక్ష, రాజాధిరాజసన్నుతాసాధారణశౌర్య దిగంతప్రసిద్ధతరౌదార్య సుజ్ఞానజనకసతతసంసేవితజనకపోషితవిద్వత్కవియూథ, భువనశోభితగుణసనాథ, బలవత్పరిపంథిగృహీత సామంతమహీకాంత విమోచనశ్లాఘనీయబాహాబల, మూర్తిమాంబాగర్భశుక్తిముక్తాఫల, చినచెవ్వనృపాలపుత్ర, సజ్జనస్తోత్రపాత్ర, రూపరేఖావిజితకుసుమసాయకసకలధర్మసంధాయక, రఘునాథనాయకప్రణీతంబైన వాల్మీకిచరిత్రంబను మహాప్రబంధంబునందు

తృతీయాశ్వాసము.

# ఆంధ్ర విజ్ఞాన సమితి,

## విజయనగరము.

అధ్యక్షులు, కోశాధిపతులు :

రావుసాహేబు వేపకొమ్మ జి. సుబ్బయ్యపంతులుగారు,

బి. ఇ. సి. ఇ యమ్. ఐ. ఇ.,

చీఫ్ ఇంజనీయరు, శ్రీ విజయనగరం ఎస్టేటు.

ఉపాధ్యక్షులు :—అడిదము రామారావు పంతులుగారు,

రిటైర్డు సీనియరు తెలుఁగు పండితులు, శ్రీ మహారాజావారి కాలేజి.

కార్యదర్శి:—గంటి సూర్యనారాయణశాస్త్రి.

లేఖకుడు:—భళ్ళమూడి నరసింహశాస్త్రి. బి. టి. పి.

కృతజ్ఞసమాలోచనసమితి.

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, శాస్త్రరత్నాకర,

శ్రీ తాతా సుబ్బారాయశాస్త్రిగారు.

శ్రీమాఁ పరవస్తు రామానుజస్వామిగారు, యమ్. ఏ.

ప్రిన్సిపాల్ శ్రీ మహారాజావారి సంస్కృతకళాశాల.

శ్రీమాన్ టి. నరసింహాచార్యులుగారు, ఎమ్. ఏ. యల్. టి.

లెక్చరర్ భాషాశాఖ శ్రీ మహారాజావారి కాలేజి.

డాక్టరు, బుఱ్ఱా శేషగిరిరావు పంతులుగారు,

ఎమ్. ఏ., పి. హెచ్. డి.

ఆకుండి వేంకటశాస్త్రిగారు,

పండితులు, శ్రీ మహారాజావారి సంస్కృతకళాశాల,

ఆంధ్రా యూనివర్సిటీ సెనెటు, ఎకడిమిక్కౌన్సిలు, బోర్డాఫ్‌స్టడీస్ సభ్యులు.

# నిబంధనలు.

పోషకులు :- సంవత్సరమునకు 10. రూపాయిలు తక్కువ గాకుండగ నిచ్చువారు యీ సమితికి పోషకులుగ పరిగణింపబడుదురు. సమితినుండి వెలువడిన గ్రంథములన్నియు వినామూల్యముగ పొందగలరు.

చందాదారులు :- సంవత్సరమునకు 4. రూపాయిలు ముందుగా నిచ్చువారు చందాదారులుగ నుండగలరు. సమితివారే తపాలాఖర్చులను భరించి గ్రంథముల నందజేయుదురు.

చందానిచ్చువారు తప్పక రశీదు పొందవలెను. చందా సొమ్ము అధ్యక్షుని పేరిట పంపవలెను. గ్రంథములు వి. పి. గా పంపబడవు.

చందాదారులుగా జేరని యితరులకు తపాలా ఖర్చులుగాక గ్రంథమొక రూపాయికి లభింపగలదు.

## విక్రమ వత్సరమున ప్రకటించిన గ్రంథములు.

1. రాధామాధవ సంవాదము :- వెలిదిండ్ల వేంకటపతిమహాకవి. ఇందు రాధామాధవుల సరససంభాషణలు, ప్రేమ, చక్కగ వర్ణింపబడినవి. వెల ౧-౦-౦

2. విస్మృత కళింగాంధ్రకవులు :- శ్రీ అడిదము రామారావుపంతులు గారు. ఇందు 15 గురు విస్మృత కళింగాంధ్రకవుల చరిత్రలు గలవు. వెల ౧-౦-౦

3. వాల్మీకి చరిత్రము :- తంజావూరు రఘునాథభూపాలుడు. ఆదికవి, వాల్మీకిమహాముని చరిత్రమిందు చక్కగ వర్ణింపబడినది. వెల ౧-౦-౦

4. ధర్మజ్ఞ చరిత్ర :- శ్రీ వేపకొమ్మ, గురువేంకట సుబ్బయ్య, శ్రీమతి ఆదిలక్ష్మమ్మగార్లు. ఇందు గార్హస్థ్య ధర్మములు, భక్తి, కర్మ, యోగప్రకారములు పంచాక్షరీ మంత్రప్రభావము మున్నగునవి మిక్కిలి చక్కగ నిరూపింప బడినవి. వెల ౧-౦-౦

5. రుక్మవతీ పరిణయము :- రేకపల్లి సోమనాథకవిప్రణీతము. పాండిత్యమునకు, రసగుంభనకు, చమత్కారమునకు శృంగాటకము. వెల ౧-౦-౦

# వృషవత్సర ప్రచురణములు.

6. కూర్మనాథకవి కృతులు - ప్రథమభాగము.

(మృత్యుంజయవిలాసము) :- గోగులపాటి కూర్మనాథకవి కృతము. ఇందు పార్వతీ పరిణయకథ యక్షగానముగ వర్ణింపబడినది.

వెల ౧-౦-౦

7. కూర్మనాథకవి కృతులు - ద్వితీయభాగము.

ఇందు లక్ష్మీనారాయణ, సంవాదము (దోరసంవాదము) సుందరీమణి శతకము, సింహాద్రి నారసింహశతకములు గలవు. జాతీయతలు, జాను తెలుగు పదములను, రసోల్బణమునను కూర్మనాథుడు కూర్మావతారమే.

వెల ౧-౦-౦

8. ద్వైతాద్వైత దర్శనములు :- మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, శాస్త్రరత్నాకర, శ్రీ తాతా సుబ్బారాయ శాస్త్రిలవారిచే ఆంధ్రీకరింపబడినవి. అద్వైతము, ద్వైతము యిందు సులభశైలిని గలవు.

వెల ౧-౦-౦

9. బాలగోపాలవిలాసము :- ఒడ్డియకవి ప్రణీతము. ఇందు నీలాసుందరీ పరిణయము పద్య రూపముగ నీప్రాచీనకవి రచించెను.

వెల ౧-౦-౦

10. తత్వసంగ్రహ రామాయణము :-(బాలకాండ ప్రథమభాగము) అకుండి వేంకటకవి ప్రణీతము. రామాయణమందలి తత్వార్థ మిందు విశదీకరింపబడినది.

వెల ౧-౦-౦

11. తత్వసంగ్రహరామాయణము :-(బాలకాండ ద్వితీయభాగము) అకుండి వేంకట కవి.

వెల ౧-౦-౦

3 ½ Rs 0-12-0
D 7/3/53

అధ్యక్షులు,
ఆంధ్ర విజ్ఞానసమితి,
విజయనగరము.